శ్రీః

పరమహంసాయ ధీమహి

# ఆత్మ తత్త్వ వివేకము

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే"

ఈశ్వర అల్లా తేరేనాం సబ్‌కో సన్మతి దేరఘురామ్!

అను సూక్తుల తాత్త్విక వివరణ.





రచయిత:

చిత్కళాతపస్వి బిరుదాంకిత

డా॥ యల్. విజయగోపాలరావు, *L. I. M.* (Madras)

డో. నెం. 21-5-13 ఆర్. యస్. పేట,

తెనాలి (ఆంధ్ర) 522 201.

This book is published with the financial Assistance of **Tirumala Tirupati Devastanams** under their Scheme "Aid to publish Religious Books."

మణిమాణిక్య గ్రంథమాల : 5వ మణి :

మొదటి ముద్రణ : జులై 1988
ప్రతులు 1000

మూల్యము : రు. 10-00

## రచయితయొక్క ఇతర గ్రంథములు

1. స్వీయ మానసోల్లాసము (శ్రీ దక్షిణామూర్తి స్తోత్రవ్యాఖ్య)
2. విజయగోపాలము (గీతయందలి ఆంతరంగిక బోధలు)
3. ద్వాదశ మణిమంజరి (తత్త్వశాస్త్ర కథావస్తువులు 12)
4. వివర్తవాద వివేకము Theory of appearances and illusions- A critique

ముద్రణ :
శ్రీ వేంకటరమణ ప్రెస్, తెనాలి.

ప్రతులకు— డా॥ యల్. విజయగోపాలరావు
రామలింగేశ్వరపేట
తెనాలి - 522 201 (A. P.)

# ము న్నుడి

డాక్టర్ ప్రసాదరాయ కులపతి
అధ్యక్షులు - తెలుగుశాఖ, హిందూకళాశాల, గుంటూరు
శ్రీ నా థ పీ ఠ ము
రచయితల సహకార సంఘము,
తం త్ర వి జ్ఞా న ప రి ష త్
గుం టూ రు.

డాక్టర్ విజయగోపాలరావుగారు తాత్త్విక చింతనాత్మకమైన గ్రంథము లింతకుముందే పండిత ప్రశంసనీయముగా రచించి యున్నారు. వారి "ద్వాదశమణి మంజరి", "విజయగోపాలము" మొదలైన రచనల నింతకుముందే చూచియున్నాను. వయోజ్ఞాన వృద్ధులైన వీరికి ఇతరుల అభిప్రాయము లవసరమని నే ననుకోను. ఈ వయసులో ఉత్సాహవంతులైన యువకులవలె తిరుగుచు పండిత మండలిని కలిసి తమ అభిప్రాయములను చర్చించుచు సదా స్మేరాననులై సంచారము చేయుచు గడుపు వీరిని చూచిన ముచ్చటవేయును. తన ఆలోచనలు ఇతరులతో కలబోసికొని సత్యము నన్వేషింపవలయునని వీరికిగల తపనయే వీరి నీ దృశమైన రచనలకు పురికొల్పుచున్నదని భావింతును.

ఆత్మతత్త్వ వివేకము వీరి వివేకమునకు వీరి తాత్త్విక సమాలోచనకు తార్కాణము. శ్రుతి స్మృతి పురాణ పరిశీలనాత్మకమైన

వీరి భావన ఈ రచనలో నిశితమై నిబిడమై నిర్భరమై అలరారు చున్నది.

ఉపనిషద్వాణిని ఆధారము జేసికొని ప్రత్యభిజ్ఞావాదము, మాయావాదము, అవస్థాత్రయములను - ప్రాతిపదికగా దీసికొని విషయ నిర్ధారణ చేయుటలో వీరు చూపిన నేర్పు, తీర్పు మెచ్చ దగినవి.

విబుధులు, విజ్ఞానాన్వేషకులు దీనిని సహృదయతతో స్వీక రింప గలరని నా విశ్వాసము.

—డాక్టర్ ప్రసాదరాయ కులపతి.

# పీ ఠి క



జనసామాన్యమునందు అన్నిమతములవారికిని ఆమోదయోగ్యమగు సుభాషిత మొకటి గలదు. ఏమన— "నానాత్వములో ఏకత్వమును దర్శింప వలె ననుటయే. "ఏకత్వము" అను పదము, ఆత్మతత్త్వమునకు మాత్రమే వర్తించును. తత్త్వములని వ్యవహారమునకు వచ్చిన జీవజగదాదులన్నియు తత్త్వశాస్త్ర బోధనాప్రయోజనము నుద్దేశించి కల్పింపబడినవి మాత్రమే. కనుక ఏకైకమగు ఆత్మతత్త్వ స్వరూపదర్శనమునకు వివేచించి విచారణ జేయుటయే అవశ్యకర్తవ్య మగుచున్నది. ఇందుకు వ్యావహారిక పారమార్థిక దృష్టిభేదముల సమన్వయముతో సామరస్యమును సమకూర్చుకొందము, ఆ ఏకైక కేవల పరమార్థతత్త్వమును సందర్శింతము.

తత్త్వశాస్త్రమునందు మౌలికమగు తత్త్వమేది? అను ప్రశ్న ఎదురైతే— "ఆత్మతత్త్వము" అను స్వరూప స్మృతిజ్ఞాన ముదయించినను, మనము తెలిసికొనవలసినవి ముఖ్యముగ మూడు తత్త్వములేయని సమాధానము వచ్చును. అవి— జీవుడు - ఈశ్వరుడు - జగత్తు అని చెప్పబడు చున్నవి. వీటిలో ప్రధానమైనవి 1. జడముగ పరిగణింపబడు జగత్తు, చైతన్యస్వరూపుడగు ఈశ్వరుడు అని చెప్పబడుచున్నవి. మూడవదగు జీవతత్త్వమును బ్రహ్మకు అన్వయించునని వేదాన్తులు సిద్ధాంతించినను ఇది స్వతంత్రమగు భిన్నతత్త్వమని ద్వైతులు చెప్పుచున్నందున మూడవ తత్త్వముగ దీనిని పరిశీలింపవలసియున్నది. కాగా "మాయ" అని చెప్ప బడుచున్నది నా అల్పవిజ్ఞానమునందు నాల్గవ తత్త్వముగ స్ఫురించుచున్నది. ఇది యొక ప్రధానమగు తత్త్వమే — ఏమన! వేదాన్తమునందు మాయతో

ముడిబెట్టి బోధింపబడని సిద్ధాంతమే లేదు. అందునను ప్రధానమైనది అద్వైత సిద్ధాంతమే.

తత్త్వశాస్త్ర సారమును ఒక్కమాటలో బోధింపవలెనన్న— "బ్రహ్మ సత్యం జగన్మిథ్య . - జీవో బ్రహ్మైవనాపరః" అని శాస్త్రములే నిర్ధారించి బోధించినవి. ఈ వాక్యము నిత్యాఽనిత్య వివేక బోధకము. అంటే నిత్యమైనవి సత్యమనియు, మిగత సర్వము అనిత్యము కనుకనే మిథ్యయనియు తాత్పర్యము. మిథ్యాపదార్థం కేవలం ఒక స్ఫురణయేగాని, త్రికాలములయందును ఉనికిగలిగి యుండదు. అనగా ఇది ఒక దృశ్యము మాత్రమే (an appearance only, caused by changes in its substance). దృశ్యపదార్థమెప్పుడూ ప్రజ్ఞాహీనమై యుండి, "తెలివి" అను మరొక తత్త్వముచే తెలిసికొనబడును. కర్మాశ్రయ (objective) వస్తువుగనుక ఇది జడపదార్థమే ఇట్టిదానిని తెలిసికొనగలుగునట్టి పదార్థమే చైతన్యము దీనినే "బ్రహ్మము" అంటారు. ఈ బ్రహ్మమే ఆత్మయని వివరించుటయే యీ గ్రంథమునకు లక్ష్యము.

నిత్యసత్యమగు ఇట్టి స్వరూపమును గురు, వేదాంతవాక్య, శ్రవణ, మనన, నిధిధ్యాసలతో వివేచించి తెలుపునదే తత్త్వశాస్త్రము. ఆ స్వరూపాను భూతికి దోహదముజేయు విధానమే తత్త్వసాధన. ఇట్టి పరతత్త్వ విషయ వివేకము గలుగుటకు ముందు విచారించవలసినది ప్రత్యక్షమగు యీ జగత్తు. ఇది ఎట్లు సృష్టియైనది? జడతత్త్వపు పరిమాణము వలననా? చైతన్య తత్త్వపు టాభాస వలననా? This Comprises of an enquiry into the 1st Cause of this creation ఈ చేతన అచేతన తత్త్వములు రెంటిలో ఏది ముందు ఏది వెనుక సృష్టియైనదను ప్రశ్నకు సమాధానము

బహు ప్రధానమైనది. ఇదియే ఆత్మతత్త్వ స్వరూప నిర్ణాయకమగు చర్చ గనుకనే ఈ ప్రాధాన్యత కర్హమగుచున్నది.

ఒక వర్గమువారు ఈ భౌతిక ప్రపంచమే ముందుగా రూపొందగా జ్ఞానము, లేక చైతన్య మనబడేది ఆ సృష్టపదార్థపు ఉనికిని మాత్రము గ్రహించుట కుపకరించు ననిరి. వీరే భౌతికవాదులు (మెటీరియలిస్ట్‌లు). మరొకవర్గమువారు జ్ఞానమే సర్వసృష్టికిని మూలము, దాని ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తుల ప్రభావమువల్లనే ఈసృష్టి కవకాశము గలిగిన దందురు. వీరినే భావవాదు లందురు (ఐడియలిస్ట్‌లు). కానీ జ్ఞానమునందు సంభవమగు నొక తప్పకేగదా భావము! అందుచే వీరిని భావవాదులనుట సముచితముగ లేదు. జ్ఞానము పరమార్థతత్త్వము గనుక వీరిని పారమార్థికులు (స్పిరిచ్యువలిస్ట్‌లు) అనుటయే సముచితము.

II జ్ఞానముచే తెలియబడి ప్రకాశించునది భౌతిక పదార్థము (the object). భౌతికముల ప్రకాశింపజేయునది జ్ఞానము (the Subject). ఇది సర్వమునకును అధిష్ఠానము ఆధారమున్ను. జ్ఞానమంటే మన ఇంద్రియములు సముపార్జించి యిచ్చు విషయవివరణగాదు ఇది సాపేక్షికము. (Knowledge of an appearance). జ్ఞానము అనగా చైతన్య స్వరూపము. అది నిరపేక్షికము (Absolute knowledge). ఇది కేవల తత్త్వముయొక్క స్వరూపజ్ఞానము. తాను స్వయంప్రకాశమైయుండి జగత్తునందలి సర్వమును ప్రకాశింపజేయుచుండును. కనుకనే దీనిని కారణ స్వరూపమంటారు. (A State of latent and unmanifest condition)— అనగా అవ్యక్తము, నిశ్చలమునగు స్థితి. ఈ సూక్ష్మతత్త్వము నందు "బహుస్యాం ప్రజాయేయ" అనగా— బహురూపముల వ్యక్తమగు

దును గాక ! అను నొక వాంఛ స్పందింప, అది వ్యక్తరూపమున భాసించును. A Patent State or state of a manifestation of Jagat occurs. ఈ విషయము అందించు తాత్పర్యమేమన— "మార్పనునది బీజశక్తి యొక్క వ్యక్త అవ్యక్తదశలయందే సంభవమగునుగాని, సహజ స్వరూపమునందు గాదని గ్రహించుటయే పరమార్థభావము". ఈ బీజశక్తియే పరిణామ కారకమగు మాయాశక్తి.

ఈ మార్పు ప్రాప్తించుటకు కొన్ని విధానములు వివరింపబడినవి :-

1. ఆరంభవిధానము : అణువులయందేగల అదృష్ట శక్తిసామర్థ్యమువలననే అవి మాలెక్యూల్స్‌గ నిర్మాణముపొంది అవి సర్వనామరూపములకు కారణముకాగా జగన్నిర్మాణము కొనసాగుటయే ఆరంభవాద విధానము.

2. పరిణామ విధానము : మహాభూతములగు తన్మాత్రలు పంచీకరింపబడి పిమ్మట నా అంశాంశ సంకలన విధానమువలన సృష్టికార్యము జరుగుచుండుట

3. వివర్త విధానము : అంటే కారణస్థితియందలి పదార్థమే తన కార్యరూపమునందున మరొకవిధముగ భాసించుట. ఇట్టి భాసకే వివర్తమని పేరు. ఇందు కారణ కార్యములకు గల సంబంధమును తాదాత్మ్య సంబంధ మందురు. తాదాత్మ్యమంటే కనిపించేరూపము (appearance) దానికి కారణమగు అధిష్ఠాన పదార్థముతో అనన్యభావముతో నుండుటయే. కనుక కారణమే మరొకరూపములో కనబడి కార్యమని పేర్కొనబడుటయే తాదాత్మ్యము.

4. వివర్తము : ఇది ఆత్మాశ్రయమైనట్టిది (Subjective).

ఈ సిద్ధాంతాన్ని శాస్త్రదృష్టితో అన్వయము జేసికొనిననే ప్రయోజనము గలుగును. జీవతత్త్వవిచారణను నిలిపియుంచితే మనకుగల ప్రధాన తత్త్వములు రెండు— జగత్తు, ఈశ్వరుడును. ఈశ్వరుడు జగత్కారణుడుగ నిర్ధారింపబడినందున, జగత్తుకు కార్యమను తాత్పర్యము లభించుచున్నది.

కార్యము, కారణముయొక్క వ్యక్తావస్థాభేదమని మనము తెలిసికొనియున్నాము. ఐనను ఈరెండు తత్త్వములకును మార్పు రూపమునందేగాని సహజ స్వరూప పదార్థములలోగాదని తాత్పర్యము. ఎట్లన — ఒక గొంగళి పురుగు తన రూపమును పురుగురూపమునకు మలచుకొని స్వయంసిద్ధమగు గూటియందు నిద్రాణముగనుండి, పిమ్మట నొక సీతాకోకచిలుక రూపమునకు తనకుతానే మలచుకొని ఎగిరిపోగలిగినట్లు. ఇంతవరకును ఈ అవస్థాభేదములకు కారణము తన చైతన్యశక్తియేగదా ! ఐనను వ్యవహారమునందు మాత్రము, బోధనాసౌలభ్యము నుద్దేశించి కారణమును ముత్తెరంగుల పేర్కొనియున్నారు. 1) ఉపాదానం : నిర్మాణమునకు ప్రధానద్రవ్యం 2) నిమిత్తకారణం (ఉపాదానమునకు రూపకల్పనజేయు తెలివి.) 3) సహకారి కారణం (ఒక నగ చేయుటకు సుత్తె, సమ్మెట, కుంపటివంటి అవసర పరికరములు). ఈ చెప్పబడిన మూడు కారణములు ఈశ్వరుని చైతన్యశక్తియందే అంతర్గతముగ యుండియున్నందున- ఒకే చైతన్యమే నర్తకుని భంగి పెక్కురూపములతో స్ఫూర్తి నిచ్చునని మనము తెలిసికొనవలసి యున్నది. ఈ అనుభూతి కలుగువరకును ప్రమాతయగువానికి జగత్తు సత్యమే— గాని ఈతడే పారమార్థికుడైనపిమ్మట జగత్తు మిథ్యయనియే

తెలిసికొనును. సర్వము చైతన్యస్వరూపమేనను జ్ఞానము సిద్ధించినతరువాత జగత్తు నిజముగాదు, మిథ్యగాదు. పర్యవసించునది కేవల పారమార్థిక తత్త్వమే. ఈ అనుభూతి పొందునట్టి ఏకైకతత్త్వమగు ఆత్మయే, అప్పుడు తాను స్వయముగ మలచుకున్న పురుగురూపమును విడిచిపుచ్చి తాను అల్లుకున్న గూడును పరిత్యజించి సీతాకోకచిలుక గుణధర్మములతో అనంత విశ్వములో విహరించును. ఇదియే సిద్ధి, ముక్తియు, మోక్షమును.

కార్యకారణములకు అనన్యత్వము గలదని తెలిసికొన్నపిమ్మట మరొక ప్రశ్న ఎదురగును. ఏమన — కారణమగు చైతన్యముయొక్క సహజ ధర్మములు కార్యమగు జగత్తునందు కనిపించుటలేదుగదా! మరి తాదాత్మ్య భావ మెట్లు సమర్థింపనగును యని. ఇది సామాన్యులు అడుగదగిన ప్రశ్నయే—"సర్వమూ చైతన్య స్వరూపమే" యని విశ్వసించినవారికి ఆత్మయొక్క గుణధర్మములు ఆ సర్వమునందే ఉండనే ఉంటవి. కాని అవి అభివ్యక్తముగా లేకపోవుటకు ఉపాధులనబడువాటితోగల సంసర్గమే కారణమని, ఈ దోషమువలననే భిన్నగుణధర్మములు భాసమానమగుచున్నవనియు సులువుగ తెలిసికొనగలరు. అద్వైత సిద్ధాంతానుసారము జీవుడును కేవలము చైతన్యస్వరూపుడే అయినప్పటికినీ, తనకుగల అవిద్యయను ఉపాధి సంసర్గము వలన పరిచ్ఛిన్నభావసంభరితుడైనందుననే ఆ దేవునికి ఈ జీవభావము ప్రాప్తించి, జననమరణ పూర్వక సంసారము ప్రవృత్తి పొందుచున్నాడు. ఈ జీవేశ్వరులు సముద్రము— అందలి కెరటములకును గల సహజ సంబంధముగలవారు మాత్రమే. కనుక భిన్నభావము వాచారంభణమేగాని, స్వరూపమునందు మాత్ర మసంభావ్యమే. జీవజగత్తులకు ఉపాధుల సంసర్గమే లేకుంటే ఉండేది ఈశ్వరతత్త్వ మొక్కటేగదా! మాయోపాధికుడైన

యీశ్వరుడే యీ జగన్నియామకుడుగాన, ఉపాధి తొలగినంతనే శుద్ధ యీశ్వరతత్త్వమే అనగా ఆత్మతత్త్వమే పర్యవసించును.

అందుచే మనము వివేచించి సిద్ధింపకొనవలసినది కేవలతత్త్వము ఆత్మయనగు పరబ్రహ్మయే. దేవుని పుట్టుకయను శీర్షిక క్రింద పొందు పరచబడిన విషయ మిదియే. అంటే దేహాత్మభావము ఉపాధిభావము సమసిపోయిననాడు తానే పరమాత్మనను ప్రత్యభిజ్ఞ పొందుటవలన జీవుడూ యుండడు, జగత్తు జగత్తుగ సంభావింపబడదు, జగత్పితయగు ఈశానుడును (స్రష్ట + నియామకుడు) యుండడు. సర్వవిధ వాచారంభణకు మూల కారణమగు మాయ యనబడు తత్త్వమూ యుండదు. మరి ఇప్పుడుండేదే మంటారా ? వ్యక్తియందు ప్రత్యగాత్మగ పరిగణింపబడునది, సమష్టియందు పరమాత్మగ వ్యవహరింపబడునదిన్ని అగు పరబ్రహ్మయే. ఇది సర్వము నకును అధిష్ఠానం. "ఏకమేవాఽద్వితీయం" ఇట్టి పరబ్రహ్మయే ఆత్మయని బోధించు విద్యయే ఆత్మతత్త్వ వివేకము. ఇదే "సోఽహం" భావ ముతో అనుభూతి పొందవలసినది. ఇదే ఆత్మ, ఇదే ప్రత్యగాత్మ, పర మాత్మయు పరమ సుఖదమగు పరబ్రహ్మయు. దీని అనుభూతి, వివేచన, సాధన, శ్రద్ధ. మననము, నిదిధ్యాసములవలన మాత్రమే సిద్ధించగలదని గ్రహించి, మతభేదశాఖాభేదములు ఆ యా శాఖలకు నియతములగు అనుష్ఠాన ములు, ఆచారములతో కాలము గడుపక ఆత్మతత్త్వ వివేచనకు గడంగుదురని ఆశించుచున్నాను. "ఆత్మానం విజానీయాత్".

అభ్యర్థన : సంప్రదాయములకు, ఆచారములకే ప్రాముఖ్యత నాపాదించి, ఆభిజాత్య అభిమానముల నతిశయింపజేసికొని, అహంకార ప్రవృత్తి నలవరచుకొని, స్వీయమత సిద్ధాంతముల ప్రస్తుతించుచు, కార్వ

ఖ్యముల కాలవాలమగు జీవితమును గడుపక — స్వస్వరూపజ్ఞానమును సముపార్జింప, సమ్యగ్దృష్టితో సాగిపోవ - ఆత్మతత్త్వ వివేక సముపార్జనయే ఆవశ్యకమని గ్రహించి, అద్దానినే పరమలక్ష్యముగ భావించి ప్రాప్తించు కొందురుగాక యని ఆశించుచున్నాను.

ఒక క్షమార్పణ : నాకు అద్వైతమే పరమ లక్ష్యమైనను— శాక్తేయ సిద్ధాంతములకూడ గుర్తించి అద్వైతసిద్ధికి వాటి సహకారమును గమనించినందున వాటినిన్ని సూచించియుంటిని. ఈమిశ్రమము పాఠకలోకము నకు ప్రయోజనకరము గాదనుకొని నన్ను మన్నింతురో, అగుననుకొని అభినందింతురో !

నమస్తే !

విజయగోపాలుడు



# విషయ సూచిక





# అచ్చు తప్పు - సవరణలు

—///—

| తప్పు | సవరణ | పేజి | పంక్తి |
|---|---|---|---|
| పరిమాణము | పరిణామము | పీఠిక 6 | 19 |
| శ్లోకమునకు | శ్లోకములకు | 1 | 8 |
| నియతీశ్వర | నియతేశ్వర | 4 | 13 |
| గీతయ దు | గీతయందు | 7 | 13 |
| జాగ్రత్ప్రపంచ | జాగ్రత్ప్రపంచ | 29 | 2 |
| కారణ | కార్య | 31 | 15 |
| odject | object | 34 | 7 |
| either | ether | 35 | 6 |
| అపక్షేయతే | అపక్షీయతే | 36 | 12 |
| అనుభవము | అనుభావము | 36 | 21 |
| అనిత్య | ఆనిత్య | 37 | 1 |
| n | in | 42 | 1 |
| వాఙ్మూలో | వాఙ్మూరో | 49 | 15 |
| syllabbs | syllables | 51 | 9 |
| జ్ఞానేశ్వర | జీవేశ్వర | 55 | 11 |
| అధిషానమని | అధిష్ఠానమని | 58 | 2 |
| పునర్మయా | పునర్మాయా | 60 | 8 |
| Aiman | Atman | 61 | 14 |
| పారమార్థికకము | పారమార్థికము | 65 | 7 |

ఇవి అకర్తృకములు - తీసివేయవలెను.

74వ పేజీలో మొదటి 8 లైన్లు తొలగించవలెను.



లలిత సంగీత రికార్డిస్ట్, రంగస్థల నటరత్నము.

ప్రసూతివైద్య శస్త్రవైద్య శేఖరుడు

తాత్త్వికగ్రంథ పంచక రచయిత

౮౫ వసంతముల వన్నెచిన్నెల

కృ తి క ర్త.

# రచయిత పరిచయము

అది శోభకృతు నామ సంవత్సరము. అందు 4-12-1903 తేదీన రేపల్లె తాలూకా కనగాల గ్రామమునందు కీ. శే. శ్రీ లక్కరాజు వేంకట సూర్యనారాయణ, మాణిక్యాంబ దంపతులకు రచయిత జనన మొందిరి. అనగా ఇప్పటి వయస్సు 85 సంవత్సరములు. కాగా వయోవృద్ధితోబాటు జ్ఞాన వృద్ధులుకూడ నగుట వీరి జీవితము నందొక విశేషము.

బాల్యమునుండియు వీరు రంగస్థలము యందును, సంగీతమునందును ప్రగాఢమగు ఆకర్షణ గలిగియుండి గ్రామఫోను రికార్డిస్టుగను రంగస్థల నటుడుగను ప్రఖ్యాతి గణించిరి. రాజమండ్రి పట్నమునందు తెనాలి రామ విలాస సభా సభ్యుడుగ ఇచ్చిన ప్రదర్శనలలో విభిన్నపాత్రల ప్రదర్శనలకు మెచ్చి పురజను లొక సన్మానపత్రమును, ఆల్‌రౌండ్ యాక్టరని చిత్రించిన బంగారు పతకముతోను బహూకరించిరి. పిమ్మట మద్రాస్‌నందు వైద్యవిద్య నభ్యసించి L. I. M, పట్టము హొందివచ్చి 40 సంవత్సరములు వైద్యవృత్తియం దుండిరి. వృత్తి యేదైనను, ప్రవృత్తి పారమార్థికము నందే సాగించి ప్రతిభను గణించుటవలన జీవితము తాత్త్విక గ్రంథ రచనలకే అంకితమై అయిదు గ్రంథముల ప్రచురించిరి. అందు మొదటిది స్వీయ మానసోల్లాసము కాగా రెండవది విజయగోపాలము.

3. ద్వాదశ మణి మంజరి (తత్త్వశాస్త్ర కథావస్తువులు 12) అనియు వీటి అవగాహనకు 3 లేక 4 సంవత్సరకాలము చాలుననియు, జన్మాంతరముల ఆవశ్యకత అనుభూతికే ననియు నిర్ధారించు గ్రంథము.

4. వివర్తవాద వివేకము : The Theory of appearances and Illusions a critique అను విమర్శాత్మక గ్రంథము.

5. ఆత్మతత్త్వ వివేకము. మతస్థులు (ఆస్తికులు) తమ మతమే గొప్పదని అహంకరించి, వాదముల సృష్టించి, వివాదముల కల్పించుకొని ద్వేష భావములతో జీవ ధర్మముల పెంపొందించుకొని, సర్వులయందును సర్వమునందును అంతర్యామియైయున్న ఆత్మతత్త్వమును గ్రహింప

యత్నించకుండుట లోకశాంతికి కల్లోలము గలిగించుటకే బాటవేయునుగాని రాగద్వేషములనుండి విముక్తులై పారమార్థికమున పయనింప సహకరించ దను బోధ. డాక్టరుగారి గ్రంథములయందలి విషయవివేకమును నేను వివ రించుటకన్న వారికి ఆశయప్రదానముల జేసినవారి పేర్లను పేర్కొనుటయే మేలని సంభావింతును. వారిలో కొందరు—

1. మహామహోపాధ్యాయ ఆచార్య B. R. శాస్త్రిగారు
M. A , Ph. D, హైదరాబాదు.
2. కళాప్రపూర్ణులు శతావధాని శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు
M. A. (Hons) Ph. D. హైదరాబాద్.
3. ఆచార్యశ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
M. A , M. Litt , Ph., D., D. Litt.
నాగపూర్ యూనివర్సిటీ ఆంగ్లశాఖాధిపతి.
4. శ్రీ ప్రసాదరాయ కులపతిగారు, M. A , Ph.D. తెలుగు శాఖాధిపతి
హిందూకాలేజి, గుంటూరు మరియు శ్రీనాధ పీఠాధిపతి.
5. శ్రీమాన్ ఎక్కిరాల వేదవ్యాస్, I. A. S.. Ph. D. హైదరాబాద్.
6. కళాప్రపూర్ణ, దర్శనాచార్య కొండూరు వీరరాఘవాచార్యులవారు-తెనాలి.
7. కళాప్రపూర్ణ డా॥ సంజీవదేవ్‌గారు, D. Litt. తుమ్మపూడి. యశస్వి.
8. శ్రీ మైలవరపు శ్రీనివాసరావుగారు, M. A. (Skt.)
ప్రిన్సిపాల్, సంస్కృత కళాశాల, తెనాలి.
9. శ్రీయుతులు హరి సాంబశివశాస్త్రి, M. A. (Skt.)
భారతీ నిరుక్తి గ్రంథకర్త, తెనాలి.
10. సాహిత్యరత్న జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి, తెనాలి.

ఇంతవరకును మన గ్రంథకర్తగారి పరిచయ వాక్యములు. ఇక వారి గ్రంథముల జదివి ఆత్మీయు లగుదురుగాక !

—యా. కల్యాణ శంకరశర్మ, B. A., B. L.
అడ్వకేట్-తెనాలి.

# కృతిసమర్పణోత్సవము
# అభినందన అభిరామము

*Dr. P. Dakshina Murthy*
**M. D., F. I. C. A.**

"ఆత్మతత్త్వ వివేకము" గ్రంథకర్త డా॥ లక్కరాజు విజయ గోపాలరావుగారు వేదాంత విజ్ఞానాన్ని సులభశైలిలో జనసామాన్యానికి తెలుపుటకు అవిరళకృషి చేస్తున్నారు.

యువకుడుగా ఉన్నప్పుడు వీరు లలిత సంగీత కళాకారునిగా, రంగస్థల నటరత్నముగా ప్రసిద్ధిచెందారు. మద్రాసులో L. I. M. పట్టం పొంది మూడు దశాబ్దాలకు పైగా గుంటూరు జిల్లాలో వివిధ ప్రాంతాలలో వైద్యాధికారిగా పనిచేసి ఉత్తమ ప్రసూతి వైద్యునిగా పేరు పొందారు.

పారమార్థిక చింతన ఉన్న డా॥ విజయగోపాలరావుగారు అనేక తత్త్వ గ్రంథాలను చదివి, ఆకళింపు చేసుకొని, ఆధునిక భౌతిక, వైద్య శాస్త్ర విజ్ఞానాన్ని, భారతీయ వేదాంత భావాలను సమన్వయపరచి అందరికి తేటతెల్లమయ్యే శైలితో, పండితుల ప్రశంసలను పొందిన స్వీయమానసోల్లాసము, విజయ గోపాలము, వివర్తవాద వివేకము, ద్వాదశ మణి మంజరి అను నాలుగు గ్రంథాలను లోగడ రచించి, ఇప్పుడు ఈ "ఆత్మతత్త్వ వివేకము" గ్రంథాన్ని మన కందిస్తున్నారు.

మత, జాతి భేదాలను, రాగద్వేషాలను విస్మరించి, మానవుడు ఆత్మతత్త్వాన్ని ఎలా గ్రహించాలో డాక్టరుగారు ఈ గ్రంథంలో తమదైన ప్రత్యేక శైలిలో వివరించారు.

తాత్త్విక పరిశీలకులు, విజ్ఞాన వయోవృద్ధులు, రంగస్థల నటకాగ్రేస రులు, నిరాడంబర, వినయ మేథాసంపన్నులు అయిన డా॥ విజయ గోపాల రావుగారు చిలుమూరులోని శ్రీరామా రూరల్ కళాశాల ప్రిన్సిపాల్, సహృదయులు అయిన శ్రీ కొలసాని మధుసూదనరావుగారికి ఈ గ్రంథాన్ని అంకితం ఇవ్వటం ఎంతో సముచితంగా ఉంది.

వారి నాన్నగారు పూజ్యులు కీ. శే. కొలసాని వెంకట సుబ్బయ్యగారి ఆశయాదర్శాలకు అనుగుణంగా కళాశాల పేరు ప్రతిష్ఠలను ఇనుమడింప చేస్తున్న విద్యావంతులు శ్రీ మధుసూదనరావుగారు. విధినిర్వహణలో తీరిక లేకున్నా సాహిత్య, లలితకళాది రంగాలలో ప్రసిద్ధులైన రచయితలను, కళా కారులను వారు ప్రోత్సహిస్తూ ఉండటం అత్యంత ప్రశంసనీయం.

శ్రీ మధుసూదనరావుగారు, వారి సోదరులు. కుటుంబ సభ్యులు విశాల భావుకత్వంతో, అభ్యుదయ దృక్పథంతో, అనేక మంచి కార్యక్రమా లకు చేయూతనిస్తూ ఉండటం హర్షణీయం.

కృతికర్త డా॥ విజయగోపాలరావుగారికి, కృతిస్వీకర్త శ్రీ మధు సూదనరావుగారికి ఈ శుభసందర్భంగా నా హృదయపూర్వక అభినందన కుసుమాంజలులు.

2-10-88

—డా॥ పి. దక్షిణామూర్తి
అధ్యక్షుడు
చైతన్య వేదిక - తెనాలి.

# అంకితము

## శ్రీ కొలసాని మధుసూదనరావుగారు

M. A., B. Ed, Principal,



శ్రీ కొలసాని వంశ ప్రతిష్ఠాపాలకుడు, ప్రజ్ఞాశాలి, రసజ్ఞుడు, లలితకళాభిజ్ఞుడు, దాత, వితరణశీలి, ఆశ్రితవత్సలుడు నగు కొలసానివంశ సుధాంబుధి చంద్రునకు గౌరవ పురస్సరముగ అంకితమైన ఈ కావ్యకన్య.

—గ్రంథకర్త.

# కృతిగ్రహీత
# శ్రీ కొలసాని మధుసూదనరావుగారు

---

## కృతిభర్త వంశ పరంపరా వివర ప్రశస్తి

పితామహులు : శ్రీ కొలసాని శ్రీరాములుగారు

పితామహి : శ్రీమతి అక్కమాంబగారు

స్వస్థానము : కొల్లూరు మండలాంతర్గత ఈపూరు.

జననీజనకులు :

శ్రీయుత కొలసాని వేంకట సుబ్బయ్యగారు

శ్రీమతి సౌ॥ రామతులశమ్మగారు

వీరి సంతతి ఐదుగురిలో—

శ్రీ మేజర్ మధుసూదనరావుగారు (జ్యేష్ఠులు)

వీరి ధర్మపత్ని శ్రీమతి సౌ॥ కృష్ణకుమారీదేవిగారు

పిమ్మట—

2. శ్రీమతి చి॥ జయలక్ష్మి, 3. చి॥ శ్రీనివాసరావు

4. శ్రీమతి చి॥ ధనలక్ష్మి 5. చి॥ శ్రీరాములుగార్లు ఏకోదరులు

శ్రీయుతులు మధుసూదనరావు, శ్రీమతి కృష్ణకుమారిదేవి దంపతుల కుమారులు, విద్యావిశారదులు ముగ్గురు.

చిరంజీవి తులసీ విష్ణుప్రసాద్, ఎమ్. టెక్.

చిరంజీవి రమణమూర్తి, బి. టెక్.

చిరంజీవి రాజశేఖర్, బి. ఎస్సీ.

శ్రీ మధుసూదనరావుగారు పావన కృష్ణానదీ తీరమున కొల్లూరు మండలాంతర్గత ఈపూరు గ్రామమున డి. 2-9-1937 న శ్రీ కొలసాని వంశ సుధాంబుధి చంద్రుడో యన జనన మొందిరి. ప్రాథమిక విద్య సహజముగ స్వగ్రామమునందే సమీకరించియుండిరి. తమ స్వగ్రామమునకు జంటగ్రామముగ విలసిల్లు చిలుమూరు నందలి శ్రీరామా రూరల్ కాలేజి యందే— తమకు చిరస్థాయి ప్రాప్తింపజేయు సుముహూర్తమున అడుగిడి ఉన్నత విద్యాభ్యాసమును పూర్తి జేసికొనుచున్న నిర్మాణాత్మక కాలమున ఆహా! ఈ కళాశాలకు నే నధిపతినై కార్యాచరణకు గడంగిన— దీని నెట్లు తీర్చిదిద్ది రూపొందించగలనను అవ్యక్తభావ మాధుర్యముచే ప్రభావితులైరి. కాగా జాతీయభావములకు స్రవంతి యగు మచిలీ పట్టణమున హిందూ కళాశాలయందు B. A. డిగ్రీ యందు తీర్ణులై, నాగపూర్ [మహారాష్ట్ర] విశ్వవిద్యాలయమునందు M. A. (Public Administration) పట్టపు తురాయి నలంకరించుకొని యావదుత్తర హిందూస్థానపు విహారయాత్ర పూర్తిజేసికొని తిరిగి ఇంటిదారిన వస్తూ గుంటూరు A. C. కాలేజి యందొక B. Ed., కూడ సముపార్జించుకొని స్వస్థానమునకు విచ్చేసిరి.

విద్య ఒక మానసికాలంకారము గాదు. సేవాధర్మ నిరతికి పునాది యైనప్పుడే దానికి ప్రయోజన మను భావముతో ప్రభావితులై రూపొందించు కొన్న మన స్తత్వముతో తిరిగి చిలుమూరు జేరి 1961 సం॥లో — వెనుకటి విద్యార్థి దశలో ప్రభవించిన అవ్యక్త మధురభావముల నాచరణలోబెట్టి ఆ యానందము ననుభూతి బొందుటకోయన "శ్రీ రామా రూరల్ కాలేజి" (గురుకులం) ప్రిన్సిపాల్ పదవీబాధ్యతల స్వీకరించి - చూడండి ! 'చిన్నారి పొన్నారి బాల బాలికల హృదయములలో, నే నంతర్యామినై సర్వతోముఖాభి వృద్ధి నెట్లు గావింతునో' అను ఆశయము వీరి జీవితములో నొక గణనీయ మైన మలుపునిచ్చి యశస్సుకు వెలుగుబాట వేసినది. తరువాత ప్రగతిపథ మెట్లు విస్తరించి సాగినదో ఈ కాలేజియే విన్నవింపగలదు. దయచేసి దర్శించండి - గ్రహించి ఆశీర్వదించండి.

మరి ప్రకృతము : కులపతి శ్రీ కొలసాని వేంకట సుబ్బయ్యగారు ఆంధ్రదేశమున ప్రముఖులగు కళాప్రపూర్ణ శ్రీ కొండూరు వీరరాఘవా చార్యులవారి రచన "మోహనాంగి" ని, శ్రీ కొమ్మినేని వేంకటరామయ్యగారి రచన "పసిడి పలుకులు" అను గ్రంథములకు కృతి గ్రహీతయై యశస్సు గణించిరి. అట్లే బాలబంధు శ్రీ నరసింహారావుగారి "పదవిపంచి" కూడ వారినే వరించి అంకిత మొనర్పబడుట శ్రీ కులపతిగారి సాహిత్యానురక్తికి, రచయితల యందభిమాన భావమునకు దర్పణము బట్టినది. కాగా- "తండ్రి చాలు బిడ్డలకు, నూలు చాలు గుడ్డలకు" అను సూక్తి ఇప్పట్టున శ్రీ మధు సూదనరావుగారి యెడ సార్థకమై వీరి వంశప్రతిష్టను పవిత్ర పారమార్థిక భావ సంభరితమైన ఆత్మతత్త్వ వివేకము అను గ్రంథమున కంకితము పొందు ఘనత శ్రీ మధుసూదనరావుగారి వంశప్రతిష్ఠను పునఃప్రతిష్ఠించుటయే

యయినది. ఈ సంప్రదాయమిట్లే స్థిరీకరింపబడి, మున్ముందు సంగీత సాహిత్యాది కళలయందును, కావ్యరచనలు, తాత్త్విక గ్రంథ రచనలందును ప్రతిభావంతులైన వారి కాశ్రయము గల్పించుచు ఈ కొలసాని వంశ సౌభాగ్యమిట్లే అనుస్యూతముగ అలరారగలదను ఆశయము నభివ్యక్తము జేయుచు ఆశీస్సుల నందించుచున్నాము.

శుభం భవతు ! సమస్త సన్మంగళాని భవంతు.

భ వ దీ య

డా॥ పి. దక్షిణామూర్తి

చైతన్యవేదిక - తెనాలి.

శ్రీ బుద్ధావతార చైతన్యస్వరూపులు



# సద్గురుమూర్తి

దివ్యశ్రీ 'మున్నంగి పున్నయ్యపంతులు' గారికి

తమ శిష్యుడు అంతేవాసియునగు

విజయగోపాలుని భక్త్యంజలి



తత్త్వరహస్య ప్రబోధకులుగ గురుత్వమును వహించు కళాప్రపూర్ణులు

శ్రీ ప్రజ్ఞానందస్వామివారు

**Dr. P. Seetharam Reddy,** Ph. D.,
Head of Department of Philosophy

**Dr. R. Venkat Reddy,** Ph. D.,
Department of Philosophy
**Osmania University Arts College,**
**HYDERABAD.**

## ఆశంస

డా॥ ఎల్. విజయగోపాలరావుగారి గ్రంథము "ఆత్మతత్త్వ వివేకము" పండిత పామర జనరంజకముగ నున్నదనుట అతిశయోక్తి గాదు. అద్వైత వేదాన్తానుసారముగ ఆత్మతత్త్వ వివరణ సరళముగ సుబోధకముగ సాగినది. ఆత్మతత్త్వము అవగాహన యగుటకు ఈ గ్రంథమున రావుగారు వ్యావహారిక పారమార్థిక దృష్టిభేదములను సమన్వయపరచి, సామరస్యమును సమకూర్చి పరమార్థమును సందర్శింప జేయుట సముచితముగ నున్నది. జీవుడు ఈశ్వరుడు జగత్తు అను తత్త్వత్రయ స్వరూపముల వివరించి తత్త్వత్రయాధ్యాసను తొలగించుకొనిననే ఆత్మతత్త్వ మనుభూతికి వచ్చునను సత్యమును ప్రస్ఫుటించుటయే ఇందలి వివేకము.

సృష్టికార్యమునకు ఆరంభవాదము, పరిణామవాదము, వివర్తవాదము అను మూడు విధానములను వివరించి అందు బీజశక్తియే పరిణామ కారకమని నిర్ధారించి తెలిపిరి. మరియు ప్రాగాత్మ పశ్చాదాత్మల స్థితిభేదములను వివేచించి తెలిపిరి. పరతత్త్వమగు పశ్చాదాత్మ స్థాయిని బొందుటకు అవస్థా

త్రయమును, ప్రత్యభిజ్ఞా విధానమును, మాయావాద వైభవమును, ఉపనిష ద్వాణిని ప్రాతిపదికలుగ గ్రహించి పొందుపరచిన విజ్ఞానము ఒక ప్రశంస నీయ దృక్పథమై యున్నది. అందుననూ, అద్వైత సిద్ధాంతమునకు మూల కందమగు మాయావాద ప్రాధాన్యమును తాను గుర్తించి చదువరులచే గుర్తింపజేయునట్లు తన నిర్వచనములతో వ్రాయుట యీ గ్రంథమున కొక ప్రత్యేకతను సంతరించినది.

ఆత్మశబ్దమునకు కఠోపనిషత్తులోని శంకరభాష్యమునందలి "యచ్చాప్నోతి యదాదత్తే" యను శ్లోకపాదములను అర్థములతో, నిగూఢ భావములతో యిచ్చిన వివరణ ఎంతో యుక్తముగ నున్నది. మరియు విశ్వ తైజస, ప్రాజ్ఞులు - ప్రత్యభిజ్ఞ మొదలైన అనేక పదములకు వీరిచ్చిన అర్థములు, తెలిపిన భావములును వేదాంత లఘు పద కోశముగ నీ గ్రంథ మును తీర్చిదిద్దినారనవచ్చును.

ఈ గ్రంథము వీరి సునిశిత మేధాసంపత్తికి తత్త్వవివేచనా చాతురికి తార్కాణము. వీరినుండి ఇటువంటి తాత్త్విక రచనలు బహుధా ప్రచురింప బడ భగవానుడు వీరి కాయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించుగాక !

**Dr. Ch. Subba Rao**
M. A. Hindi, M. A. Philosophy
Ph. D. & D. Litt.
*Retd. Head Hindi Dept.*
Hindu College,
MACHILIPATNAM (A. P.)

# సందర్శిక

భారతీయ సంప్రదాయం ప్రకారం మానవ జీవితాని కొక లక్ష్య మంటూ వుండాలి. అది లక్ష్యహీనం కారాదు. గమ్యం లేకపోతే గమనాని కర్థం లేదని భారతీయుల నమ్మకం. ఈ ప్రకారం మనం చేయు ప్రతి పని ఒక ధ్యేయంతో ఒక ప్రయోజనం కోరకు నిర్వహింపబడాలన్నమాట. తాత్వికంగా మానవజీవితానికి లక్ష్యం ఆత్మసాక్షాత్కారమని ఎనాడో భార తీయులు గ్రహించారు. అదే వారికి పరమావధి.

ఆత్మసాక్షాత్కారమంటే తన్ను తాను తెలిసికొనడమే. తాను (Self) అంటే ఏమిటి ? ఈ ప్రశ్నకు సమాధానం రాబట్టేందుకే ప్రపంచ తాత్వికు లందరు పరిపరి విధాల యోచించి పలు అభిప్రాయాలను ప్రకటించారు. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో దర్శనశాస్త్ర స్వరూప స్వభావాలన్నీ ఈ సమాధానంపైనే ఆధారపడి ముందుకు నడిచాయని చెప్పవచ్చు. ముఖ్యంగా ఈ విషయంలో వ్యక్తమైన ధోరణులు రెండే రెండు. ఒకటి ఆత్మ సేంద్రియ దేహాని కతీతమైన ప్రత్యేక ప్రతిపత్తిగల నిరపేక్ష నిర్గుణ సత్తా అనేది; రెండు - పంచభూతాత్మక శరీరానికభిన్నమైన ప్రతిపత్తిరహిత సాపేక్ష సగుణ దైహిక సత్తా అనేది. ఈ రెండు ధోరణులే దార్శనికజగత్తులో వివిధ రూపాలలో విస్తరించాయని చెప్పవచ్చు.

బ్రహ్మవిద్యను ప్రతిపాదించిన భారతీయ ఉపనిషత్తులు ఆత్మను గురించి విస్తారంగా చర్చించాయి. అవి ఆత్మను జీవంగానో, ప్రాణంగానో చెప్పలేదు. ఆత్మ సంకల్పాత్మకమైన మనస్సు కాదు, ఆత్మ వివేచనాత్మకమైన బుద్ధి కాదు. ఆత్మ ఈ దేహస్థితి కాధారమైన ప్రాణంకూడ కాదు. నిరాకృతమైన ఈ మూటికి అది భిన్నమైనది, అతీతమైనది. అంటే దాన్ని ఒక చైతన్యమనుకొందామా?...చాలదు. ఛాందోగ్యోపనిషత్తు ప్రకారం అది దేహ చైతన్యం మాత్రం కాదు, స్వప్న చైతన్యం మాత్రం కాదు; సుషుప్తి చైతన్యం మాత్రంకూడ కాదు; అది ఈ మూటికి అతీతమైన విశుద్ధ చైతన్యం. అది సర్వత్రా వ్యాపించి సర్వానికి అతీతమైన నిర్గుణ, నిరపేక్ష చైతన్యం. అది కూటస్థం, తురీయం, వికార రహితం. ఆత్మకున్న అస్తిత్వం యింత వ్యాప్తమైనది కనుకనే అది నిర్గుణ బ్రహ్మతో తుల్యత్వాన్ని పొందింది.

భారతీయ దర్శన శాస్త్రాలు చాలవరకు ఆత్మను ఈ దేహానికి నియామక సత్తాగా, జీవునికి పర్యాయవాచకంగా నిర్ణయించాయి. ఆచార్య శంకరుడు ఆత్మను జీవుడుగానే అర్థం చేసికోవాలని చెపుతూ ఇంద్రియ కార్యకలాపాలను నిర్వహించడం, కర్మఫలాన్ననుభవించడం దాని బాధ్యతలే నన్నాడు. గీతాకారుని దృష్టిలోకూడ ఆత్మ జీవునికి పర్యాయమే. కాని అది వికారరహితం. దయ, ప్రేమ, ఈర్ష్య, ద్వేషం, సుఖం, దుఃఖం వంటి భావాలన్నీ దేహానికి (క్షేత్రం) వికారాలేగాని ఆత్మకు క్షేత్రజ్ఞుడు) కావని గీత మతం. వైశేషిక దర్శనంమాత్రం మానసిక వికారాలన్నీ ఆత్మ గుణాలని చెపుతూంది. అంటే ఈ దృష్ట్యా ఆత్మ నిర్గుణం కాదు, సగుణమనే అనుకోవాలి.

జైన దర్శనంలో చైతన్యం ప్రాణి లక్షణం. ఆత్మ చేతన ద్రవ్యం. అదికూడ జీవుడే, కాని అది వికార రహితం, సర్వాతీతం కాదు. దేహంతో కలిసే అది శుభాశుభ కర్మలకు కర్తగాను, కర్మ ఫలాలకు భోక్తగాను వ్యవహరిస్తుందట. దానికి సుఖదుఃఖాల అనుభూతి వుంటుంది. కనుక యిచ్చట కూడ ఆత్మ సగుణమే అనిపించుకొంటుంది.

గౌతమ బుద్ధుడు మాత్రం ఆత్మస్థితిని ప్రత్యేకంగా గుర్తించలేదు. దేహం, మనస్సు, ఇంద్రియాలు, భౌతిక-మానసిక ప్రవృత్తులు అన్నీకలిసి "ఆత్మ"గా వ్యవహరించడం మినహా ఆత్మకు ప్రత్యేక ప్రతిపత్తి లేదు. బుద్ధ దర్శనంలో ఆత్మ అనేది అన్ని అనాచారాలకు, అవినీతులకు మూలం. ఆత్మసిద్ధాంతం (Spiritualism) అనేది ఈలోకంలో అన్ని చెడులకు ఆశ్రయమని నమ్ముతుంది బౌద్ధం. కనుక బౌద్ధులలో ఆత్మకు చోటులేని నైరాత్మ్యవాదం లేక సంఘాతవాదం ప్రచారంలో వుంది.

ఇక పోతే చార్వాకుని లోకాయతన దర్శనం అసలు శరీరానికి భిన్నమైన ఆత్మ అంటూ ఏమీలేదని చెపుతూంది. మనం ఆత్మకు సంబంధించి ఆలోచిస్తున్న అతీంద్రియ లక్షణాలన్నీ దైహికగుణాలే తప్ప వేరు కాదని వారి నమ్మకం. కారణం దేహాన్ని తొలగించి ఆత్మ, గీత్మ అంటూ ప్రత్యేకమైన వాటిని నీవు దర్శించలేవు కనుక. దేహం నశించినపుడు దాని సంబంధిత అంశాలేవీ మిగలడంలేదు కనుక.

భారతీయ తత్వవేత్తలు ఒక్క చార్వాకుని మినహాయించి దాదాపు అందరు ఆత్మకు ఏదోరూపంలో ఒక ప్రత్యేకత నూహించారు. దాన్ని దేహానికి భిన్నంగా నియామక శక్తిగా నిలబెట్టారు. కాని పాశ్చాత్యులు

మాత్రం ఆత్మను ప్రత్యామ్నాయంగా మనస్సును ప్రతిపాదించారు. వారి దృష్టిలో మనస్సు (Mind) ఆత్మ (Soul) రెండు అభిన్నమైనవి, అచ్చట ఆత్మకు ప్రత్యేకస్థితి అంటూ వుండదు.

గ్రీకు తత్వవేత్త ప్లేటో ఆత్మను ప్రజ్ఞ (Intellect) ఇచ్ఛ (will), విషయవాసన (Sensuality) అనువాటి మూటి కలయికగా మాత్రమే గుర్తించాడు. మరొక ప్రాచీన గ్రీకు దార్శనికుడు జీనో దేహానికున్న క్రియా శీలత (activity) దాని ఆత్మ అన్నాడు. జర్మన్ తత్త్వవేత్త హర్బర్టు భావం, అభిప్రాయం, సంకల్పం అనువాటి కలయికను ఆత్మ అన్నాడు· నిర్గుణం, నిర్వికారం అయిన ఈ ఆత్మ పదార్థంలో జ్ఞానమూలకమైన సంవేదనను (sensation) సృష్టిస్తుందని అయన సిద్ధాంతం.

ఫ్రెంచి తాత్వికుడు బర్గసన్ (Bergson) ప్రాణి శరీరాన్ని ఒక యంత్రంగాను, ఆత్మను ఆ యంత్రాన్ని నడుపు ప్రాయోగిక శక్తి (motive force) గాను అభివర్ణించాడు. సంవేదన (sensation), స్మృతి (remembrance) అనేవి ప్రాణికి సజీవ సహజ లక్షణాలనియు, ఆత్మ వాటికి తదభిన్న (identical) మనియు అభిప్రాయపడ్డాడు.

ఆత్మతత్వ వివేకం అనగానే అది సాధారణ మానవ జీవితంతో సంబంధంలేని శుద్ధ శాస్త్రీయ వేదాంత విషయం అనుకోనవసరం లేదు. అది మానవుని లౌకిక జీవితానికి, జీవన సమస్యలకు సంబంధించు వ్యావహారిక పరిజ్ఞానమే నంటాను. అయితే అది తరతరాలుగా గ్రంథ జ్ఞానం కలిగిన ఆధ్యాత్మవిదుల ఆలోచనలలో పడి, తాత్వికుల సిద్ధాంతాల స్ఫూర్తిని పొందుతూ సామాన్యుల కందుబాటులో లేని పాండిత్య విషయంగా భాసి

స్తూంది. అంతే. నిజంగా ఆత్మ, దానికి సంబంధించిన ఆత్మజ్ఞానం, ఆత్మ తత్వం, ఆత్మానందం, ఆత్మోన్నతి, ఆత్మగౌరవం, ఆత్మబోధ, ఆత్మీయత, ఆత్మతుష్టి, ఆత్మస్తుతి, ఆత్మసాధన, ఆత్మరక్షణ, ఆత్మ సంయమనం మొద లగు శబ్దాలన్నీ మానవుని నిత్యజీవితంలో అడుగడుగునా అతనికి తారసపడి అతనికి సమస్యాపరిష్కారాన్నందించేవే. కాని కన్నున్నవానికే అద్దం విని యోగపడునట్లు దాని నిజానిజాలను గమనించుగోరువానికే దాని ప్రయోజన ముంటుంది.... రామాయణ కథానాయకుణ్ని పరబ్రహ్మ, పరమేశ్వరుడు అనుకొంటే ఆ కావ్యంనుండి మనం నేర్చుకొనే దేముంటుంది? ... మనం మానవులం కదా!! రాముడు "ఉత్తమ జీవితాన్ని తెలియజెప్పిన ఆదర్శ మానవుడె" అనుకొంటే మనం ఆయన జీవితంనుండి నేర్చుకొనేందు కెంతెనా ఆస్కారముంటుంది. అలాగే ఆత్మ తాత్వికులకు, తార్కికులకు చెందిన సిద్ధాంత విషయం మాత్రమే కాదని తెలిసికొన్నప్పుడు సామాన్యుల సమస్యా ప్రాతిపదికపై దానినుండి ప్రయోజనం పొందేందుకు వీలుంటుంది.

ఇంతకు ఆత్మ అంటే ఏమిటి? అదొక ఇంద్రియ జ్ఞానానికందని నిర్గుణ సత్తా, నిరాకార శక్తి. అది జీవికి జీవం, జడానికి జపం. జడ-జీవరాసుల కిది చోదక శక్తి. ఈ శక్తి లేనిదే సృష్టి మనుగడ కర్థ ముండదు, ప్రకృతికి పరమార్థముండదు. శబ్ద, స్పర్శ రూప రస గంధాదులతో సహా పంచ జ్ఞానేంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం, అనేవన్నీ ఈ శక్తినే పరిభ్రమిస్తూ వుంటాయి. అది వాటన్నిటికీ అతీతమైనది. పంచ భూతాత్మకమైన ఈ చరాచర సృష్టిలో అది సర్వత్రా వ్యాపించి వుంటుంది. అది విలక్షణమైన సత్తా, సృష్టికి ఆలంబనం. పంచభూతాత్మక సృష్టి దానికి ఆశ్రయం. ఆశ్రయాన్నిబట్టి దాన్ని పలుపలు విధాలుగా వ్యవహరిస్తున్నాం.

పదార్థాన్నాశ్రయించినప్పుడది పరాశక్తిగాను, ప్రాణిదేహాన్ని ఆశ్రయించి నప్పుడది ఆత్మగాను, సంపూర్ణ విశ్వాన్నాశ్రయించినప్పుడది పరమాత్మగాను సమాలోచింప బడుతుంది.

ఏదైనా ఆత్మ మానవుని ఆలోచనా పరిధిలోని విషయంకాబట్టి జీవితానికి సంబంధించినంతవరకు దాని కధిక ప్రయోజనముంది. ఈ గ్రంథంలో గ్రంథకర్త "ఆత్మతత్త్వ వివేకం" పేరుతో ఆత్మానాత్మ వివేక విజ్ఞానాన్ని చర్చించారు. దశేంద్రియాత్మకమైన ఈ దేహానికి, దాని అస్తిత్వానికి స్ఫూర్తి నిచ్చు ఆత్మకు గల సంబంధ బాంధవ్యాలను చర్చించారు. ఇంతేకాక దేహాత్మ విజ్ఞానాన్ని తెలియజెప్పేందుకు సత్వ రజః తమో గుణాలు, జాగృత-స్వప్న-సుషుప్త్యావస్థలు, జ్ఞానం-జ్ఞాతం-జ్ఞేయం, క్షేత్రం-క్షేత్రజ్ఞత, కూటస్థత, ప్రత్యభిజ్ఞత, వివర్త మీమాంస, మాయావాద స్వరూపం, కార్య కారణ సంబంధం మొదలగు ననేక తాత్విక విషయాలను చర్చించడం జరిగింది. దీనిద్వారా మతాల పేరుతో, ధర్మం పేరుతో ఆ మహత్ తత్వాన్ని సైతం ముక్కలు ముక్కలుగా విడగొట్టి మారుపేర్లు పెట్టి, మఠాలు గట్టి, మానవత్వాన్ని మంటపాలు చేస్తున్న నయవంచకుల స్వార్థాలను బట్టబయలు చేశారా అనిపిస్తుంది. అయితే ప్రతిపాద్య విషయం సామాన్యుని అవగాహన కందని గహనత (seriousness) నందుకొన్న కారణంగా ఆత్మతత్వం శుద్ధ తాత్విక విషయంగానే మిగిలిపోయినదని చెప్పవలసి వస్తుంది.

ఏమైనా 'ఆత్మతత్త్వ వివేకం' అంటే మనిషి తన్ను తాను తెలిసికొనే అవకాశాన్ని చింతనాపరులైన పాఠకులకు ఈ చిరుగ్రంథంద్వారా కలుగజేసిన రచయిత ధన్యుడు. తెలుగువారి కిటువంటి గ్రంథాన్ని రచించి యిచ్చినందులకు డాక్టరుగారైన ఈ రచయిత నభినందిస్తున్నాను.

—డా॥ సి. హెచ్. సుబ్బారావు.

అసలు గ్రంథపు ప్రచురణానంతర మందింపబడినదైనను విశ్లేషణా విధానమును విమర్శాపాటవమును హృదయంగమముగ నుండి గౌరవ భావమును గల్పించినందున - ఈ సమీక్ష కీ గ్రంథమున స్థానము కల్పించుట సముచితమని ఎంచి ఆత్మతత్త్వ వివేక పాఠకులకు దీని నందించుచున్నాను. -గ్రంథకర్త.

# ద్వాదశమహామంజరి
## గ్రంథ సమీక్ష

శిరోమణి విద్వాన్
భాగవతుల కుటుంబరావు
రిటైర్డ్ ప్రిన్సిపాల్, నేషనల్ కాలేజి,
మచిలీపట్నము.

ఈ గ్రంథకర్తయొక్క పరమగురువులు నిశిత తార్కికదృష్టి గలిగి నిరంతర సాధనతో అద్వైతానుభూతి నందిన యతీశ్వరులు. వారి అంతేవాసులలో అగ్రగణ్యులుగ ప్రఖ్యాతికి వచ్చిన శ్రీ మున్నంగి పున్నయ్య పంతులుగారు వీరి గురువులు. ఈ గ్రంథకర్త ఆంగ్ల ఆయుర్వేద వైద్య శాస్త్రములను అధునిక భౌతిక శాస్త్రములను అధ్యయనము జేసినవారు. శ్రీ అరవిందయోగి భావనాప్రభావితులైన తత్త్వజిజ్ఞాసువు. భగవద్గీత యందలి నిగూఢ విషయ వివరణ జేయు 'విజయగోపాలము' అను గ్రంథ

రచనతో "చిత్కళాతపస్వి" గ హైదరాబాద్‌నందు అభినందింపబడిన తత్త్వసాధకుడు.

పదార్థముతో ప్రారంభముజేసి పరమాత్మవరకును గల విషయముల వివేకమును, పూర్వాపర సంబంధములతో ఒక నిర్దిష్ట అనుక్రమమున ప్రవర్తింపుట ఈ గ్రంథమునందలి విశిష్టత. ఇందు విషయములను మూల గ్రంథముల యందలి శ్లోకములకు తాత్పర్యమాత్రములుగ వ్రాయుట గాదు; తాను శ్రవణముజేసిన బోధలను చిలుకపలుకులనువలె చిత్రించుటయుగాదు- "శ్రోతవ్యః శ్రుతి వాక్యేభ్యః మంతవ్యశ్చోప పత్తిభిః" అను వాక్యార్థమును పాటించి రచయిత శ్రుతి వాక్యముల కనుగుణమగు యుక్తులను, ఉదాహరణలను ఆంగ్ల ఆయుర్వేద వైద్యశాస్త్రముల వెలుగుతో, భౌతికశాస్త్ర భావముల సమన్వయముతో ప్రస్ఫుటించిన స్వతంత్ర భావములు విజ్ఞులగు ఆధునికులకును మాన్యములుగ నున్నవి.

జటిలములగు అద్వైత సిద్ధాంతముల నెట్లు గ్రహించగల మాయను సంశయములు గలవారినేగాక — హేతువాదులను, మానవతావాదులనేగాక- అద్వైత సిద్ధాంత నిందకులనుకూడ మనసున బెట్టుకుని మనన భావములను వివరణతో వ్రాసిన గ్రంథ మీ మణిమంజరి. పండితుల నిగూఢ ప్రగాఢ భావములను ఆధునికులగు ఆంగ్లవిద్యాధికులకు, వారివారి దృక్పథముల కనువుగ విషయ వివేకముల పొందుపరచియున్న ప్రకరణగ్రంథ మీ ద్వాదశ మణిమంజరి.

ఫిలాసఫీ M. A. పరీక్షలకు సంసిద్ధులగువారి కత్యంతోపయుక్త గ్రంథ మీ మణిమంజరి. పన్నెండు ప్రధాన అంశముల పేర్కొని వేదాన్త శాస్త్ర పరిధిని ప్రకాశింపజేసిన పాఠ్యగ్రంథ మీ ద్వాదశ మణి మంజరి.

జడము, చైతన్యము, మిథ్య, మాయ, అవిద్య, అజ్ఞానము మున్నగు పదములను నిర్వచించుటయేగాక, గుణములు, తన్మాత్రలు, ఆవరణము, విక్షేపము, వివర్తము, కూటస్థుడు, ప్రత్యగాత్మ, పరమాత్మ, హిరణ్యగర్భుడు మున్నగు అనేక పారిభాషిక (సాంకేతిక) పదములకు సూటిగ వర్తించు భావముల వివరణ నిచ్చినందున క్రొత్తగా శాస్త్రపరిచయము ప్రవేశము, నభిలషించువారికి సహకరించు ఈ మణిమంజరి సాక్షాద్గురు కల్పము. అద్వైతము-వివర్తము అను అంశములపై వచ్చు అధునికుల ఆక్షేపణలను ఎన్నికజేసి చూపి- అందులకు అందించిన సమాధానములు గ్రంథకర్తయొక్క విషయ విజ్ఞానమునేగాక విమర్శాపాటవమునుకూడ జూపు కరదీపికలవలె నున్నవి. ఈ గ్రంథపు పీఠికయందే ఇట్టి దీపికల వెలుగు సుసంపన్నముగ నున్నది.

కొన్ని సిద్ధాంతములకు సంప్రదాయసిద్ధముగ జెప్పబడుచున్న అర్థములు సమర్థనీయములుగ లేవని వాటిని వ్యతిరేకించి, తన స్వతంత్ర భావములతో సమన్వయముల పొందుపరచి నిర్ధారించు టొక గమనీయమగు విషయము. జటిలమగు వేదాంత విషయముల నొక కథవలె నడిపించి చదువరులకు నింకను చదువవలె నను ఆసక్తి పెల్లుబుకునట్లు వివరణ జేయుట యీ గ్రంథమునందలి ప్రత్యేకత. శాస్త్రవిషయముల జీర్ణించుకొన్న వ్యక్తికి గాక అన్యులకు ఇంత సుబోధకముగ వ్రాయు ప్రతిభ కలుగజాలదు.

వేదాన్తశాస్త్ర పరిధిని పరిశీలించి, విశ్లేషించి — అందు మౌలికములనదగు విషయములు తొమ్మిది ప్రాకృతములు, మూడు దివ్యములనియు వర్గీకరించి తెలిపి, యీ పన్నెండు కథావస్తువులకు (Subject matters) గల పూర్వాపర పరస్పర సంబంధముల గ్రహించి అధ్యయనము జేసినవారికి

శాస్త్రవిషయములను అవగాహనతో (Comprehension) సమగ్రముగనేర్వ మూడు నాలుగు సంవత్సరములు చాలునని నిర్ధారించుటయే గ్రంథకర్త ఆశయము. కనుకనే ఇది ఒక నవ్యవిధానమున రచింపబడిన అపూర్వ గ్రంథము.

ఇక రచనలో.... 1) పదార్థమును వివరించుటకు Law of inertia (తమోగుణ ధర్మములు), Law of force (రజస్స్వభావమగు స్పందన ధర్మమును), and the law of equilibrium (సామ్య స్థితి కారక ధర్మము) లను తులనాత్మకముగ పేర్కొనుచు ప్రసరించిన వెలుగు.

2) గుణత్రయ వివరణకు, ఆ గుణ లక్షణములను ప్రవృత్తిని— ఆయుర్వేదమందలి త్రిధాతు-త్రిదోషముల ప్రవృత్తులతో పోల్చి అందించిన విజ్ఞానము.

3) యోగశాస్త్ర వివరణయందు- జీవునికి స్థానము హృదయమా? మెదడా? హృదయము ఉరస్సున కుడివైపున నున్నదా ఎడమ పార్శ్వమున నున్నదా? అను చర్చ.

4) అద్వైతము, పరిణామము, వివర్తము అను అంశములపై వీరు అందించిన వివేకము ఇదియొక విమర్శాత్మక గ్రంథమని (Critique) చాటి చెప్పుచున్నవి.

శాక్త సిద్ధాంతములు శంకరానుయాయులకు కేవలము త్యాజ్యములు గావు- అను చర్చ ఎంతో కనువిప్పు కలిగింపక మానదు. వార్తికకారులైన సురేశ్వరాచార్యులు, శాక్తమునకు సంబంధించిన "విమర్శ ప్రకాశము"లను

పదముల ప్రయోగించుటయు, కేనోపనిషత్తునందు "ఉమ - హైమవతీ" కఠోపనిషత్తునందు " అదితి " మున్నగు పదములు శక్తిని మాన్యముగ మన్నించి తెలుపుటవలన శక్తి – శక్తిమంతుల కభేదము సిద్ధించుచున్నది. కనుక దీనియందు ద్వైతము, స్వగతభేదమును భావములు స్ఫురించరాదు. శక్తి శక్తిమంతుల కభేదమే సిద్ధించుచున్నదనియే చెప్పవలసివచ్చును.

జగత్తు, బ్రహ్మదృష్టితో వివర్తము, శక్తిదృష్టితో పరిణామము అని యనుచో- శక్తిని కారణబ్రహ్మగనో బ్రహ్మ భిన్నపదార్థముగనో స్వీకరించుచో- పరిణామ వివర్తవాదములకు అన్వయము కుదురును. "సచ్చత్యచ్చా భవత్ నిరుక్తంచ అనిరుక్తంచ నిలయనంచ అనిలయనంచ" అను వాక్యములకును సమన్వయము పొసగును.

భావము : ఆ పరబ్రహ్మ నుండియే సద్రూపము అసద్రూపము అయిన జగత్తు యేర్పడెను. అట్లే నిలయనము (అచ్ఛాదనము లేని భాగ) 'Space) కూడ యేర్పడెను. అనగా నిర్వచింపదగినది, నిర్వచింప వీలు లేనిది అను రెండు భావములును సమన్వయ సామరస్యముతో ప్రవర్తించెను. ఇందుచే పరిణామము వివర్తమునకు పూర్వరంగమనుటకును అనువగు చున్నది. "Consciousness is only singular but not plural" అను Shrodinger సూక్తియు అనుసంధానింప అనువగు చున్నది. 'సామిథ్యా' పద నిర్వచనము, వివర్తవాద నిరూపణము సమర్థనీయములై తంత్రశాస్త్రమునందలి భావములకు సమన్వయము లభించును.

1) త్రిగుణస్వరూప స్వభావ పరిజ్ఞానము లోక కల్యాణ కారకము- అను గ్రంథకర్త సూక్తి శిరోధార్యము.

2) గ్రంథము చివరనున్న "అద్వైత సిద్ధాంత ప్రధాన సూత్రములు" అను అనుబంధమున్ను నిరంతర మనయోగ్యముగ యున్నది.

3) ద్వాదశ మణి మంజరి వేదాన్త జిజ్ఞాసువులకు మాత్రమే గాక శాస్త్ర బోధకులకును పఠనీయమగు నొక పరిశోధనాత్మక ప్రకరణ గ్రంథమని నా విశ్వాసము.

4) ఇట్టి ఉత్తమ గ్రంథము వెలుగు జూచుటకు ఆర్థిక సహాయము నందించిన శ్రీ తిరుపతి తిరుమల దేవస్థాన యాజమాన్యమువారు స్తవనీయులు.

—భాగవతుల తుటుంబరావు.



# కృతి - సుకృతులు

1. బ్రహ్మశ్రీ తాడేపల్లి పేరయ్యశాస్త్రిగారు
   అడ్వకేట్ - తెనాలి.
   తమ మేనమామ కీ. శే. పిల్లలమర్రి సత్యనారాయణగారి
   స్మారక విరాళము రు. 58-00
2. శ్రీ శ్రీ దయానంద స్వామివారు
   ధ్యాననిష్ఠాశ్రమము, కరీంనగర్. రు. 50-00
3. కీ. శే. ఎర్మా రెడ్డి రామిరెడ్డిగారి ధర్మపత్ని
   సరసమ్మగారు, కరీంనగర్. రు. 25-00
4. శ్రీ వాంగ్గలి వెంకటయ్యగారు
   జిల్లా పరిషత్ ఉద్యోగి, కరీంనగర్. రు. 25-00

అయాచిత దాతలగు పై సుకృతులకు నా కృతజ్ఞతలు. మరియు ఈశ్వరానుగ్రహముచే జ్ఞాన వైరాగ్యసిద్ధియు సమస్త మంగళానుభూతులును లభించుగాక.

—గ్రంథకర్త.

ఈ చిరుగ్రంథమునకు మున్నుడి వ్రాసియిచ్చిన శ్రీ ప్రసాదరాయ కులపతిగారికి, విపులమగు సందర్శికను ప్రదర్శించిన దర్శనాచార్య శ్రీ డా॥ చలసాని సుబ్బారావుగారికి, శ్రీ డా॥ P. సీతారామ్‌రెడ్డి, (Head of Dept. of Philosophy), శ్రీ డా॥ R. వెంకట్‌రెడ్డిగారికి నా కృతజ్ఞతలు తెలుపుకొను చున్నాను.

గ్రంథ ముద్రణలో కూర్పునందలి నేర్పుకు శ్రీ మునిపల్లె రామమూర్తిని ఉత్తమ కంపోజిటర్‌గ అభినందించుచు, సంస్థ ఖామందుగా చి॥ శ్రీకాంత్‌రెడ్డి ప్రూఫులు దిద్దుటలో చూపిన శ్రద్ధ, యాజమాన్యములో చూపిన సామర్థ్య సంపదకు ఆయనకు నా హృదయపూర్వక ఆశీస్సులు.

—గ్రంథకర్త.

# Philosophy of Religion

Religion— a Stabiliser, lays down certain rules for a healthy living not only for the individual, but for the integrity of the society as well. Since application of the tenets in a religion enables one to economise and accumulate his spirItual anergy to endeavour and avoid ethical depravity, it stabilises the mental and emotional equilibrium.

Devoid of this target as its main purpose to carve out the spiritual beauty hidden in the Stony Jadam to the state of Chit is inconceivable and can't, therefore, illuminate one's path to the supreme Spiritual Stratum. The noble joy of a wider life, springing up from the fountain head - the Atman, can never be achieved and experienced by 1. Idoletry (without the superimposition of the transcendental;- the thing in itself, on which, even the object of worship is said to be superimposed). 2. Zooletry (worship of the flora & fauna) and 3 Toombetry (worship of toombs and manes).

Struggles, Conflicts or even conflegrations with regard to the supremacy of one creed or sect over the other; is vain and will never be conducive to calm thinking or judicious acting. As such, religion will have no root nor, can it bear fruit. Atmatatva Vivekam is the only Beacon light to lead one towords the Goal of realisation,

—*Dr. L. VIJAVAGOPALA RAO.*
the author.

శ్రీ



# ఆత్మతత్త్వ వివేకము

శ్లో॥ ఆత్మలాభాత్పరోలాభో । నాస్తీతి మునయో విదుః ।
తల్లాభార్థం కవిస్తౌతి । స్వాత్మానం పరమేశ్వరమ్ ॥

ఈ కారిక శ్రీ సురేశ్వరాచార్యకృత మానసోల్లాసము నందలిది. ఆత్మజ్ఞాన లాభమున కంటెను అధికతరమగు లాభము మరొకటి లేదనియే దీని భావము. ఈ విషయమును జ్ఞాననేత్రముతో మునులు తెలిసికొని ఆదేశించిరిగాన ఆత్మతత్త్వ వివేకమే జిజ్ఞాసువులు పొందదగినదనియు అందుకు తత్త్వసాధన దప్ప మరొక మార్గము లేదనియు నిర్ధారింపబడినది. మానసోల్లాసమునకు మూలగ్రంథమగు శ్రీ దక్షిణామూర్తి శ్లోకములకును ఆత్మప్రబోధమునందే తాత్పర్యమనుటయు సుప్రసిద్ధము. కనుక ఇట్టి ఆత్మతత్త్వ వివేక సముపార్జనమే మనకు ప్రకృతము. అస్తు !

ఆత్మతత్త్వ విషయమును పరిశీలించుటకు ముందు ఒక మర్మమును విప్పిచెప్పి తేటతెల్లము జేయు టావశ్యకమని భావింతును. ఏమందురా? ఆత్మయన దేవుడని అభిప్రాయపడకండి. ఆత్మతత్త్వ వివరణకుముందు దేవుని పుట్టుక విషయమును వివరింతును వినండి :—

దేవుని పుట్టుక :

ఈ ప్రపంచమును అందరి జీవకోటిని ఎవరో ఒకాయన సృష్టించాడని దానిని రక్షించుచుంటాడనీ మీరు అంటుంటారే! ఆయన్నే — ఆ సృష్టి స్థితి లయముల పొసగించుకాలమున "దేవుడు" అని పరిభాషించి పలుకుతూ యుంటారు. ఈ ప్రపంచము దాని సృష్టి ప్రసక్తము గాకయుంటే దేవుని విషయము అసలు ప్రసక్తమై యుండెడిదే గాదు. ఆయన ఉనికియు ఉటంకింపబడి యుండెడిదే గాదు. ఏమన-

ఈ సృష్టియే లేనియెడల తాను సృష్టించే దెవరిని? పాలించే దెవరిని? తాను ఒక డున్నాడని అనుకొనవలసిన అవసరమేమిటి? అందువలన "బహుస్యాం ప్రజాయేయ" అను నొక సంకల్పము స్పందన కలిగినప్పుడే ఈసృష్టి సంభవమై ఆ దేవుని పుట్టుకయు సంభవమయ్యెను. అయితే "పుట్టుట గిట్టుటకొరకె" అను సూక్తి ఈ దేవునికికూడ వర్తించునా? ప్రలయకాలమున ఆ పరబ్రహ్మమునకుదప్ప ఈ సగుణకార్యబ్రహ్మకునికి ఊహాతీతమే. కనుక మాయను ఉపాధిగ గ్రహించి ప్రవృత్తిని ప్రారంభించిన దినమే దేవుని జన్మదినమని సంభావింపవలసి యున్నది. అపుడు అవిద్యోపాధికుడగు జీవుని స్థాయి నతిక్రమించి పైస్థాయి కధిగమించిన మాయోపాధి సహిత చైతన్య విశేషమే ఈ దేవుడు.

The conception of the word 'God' is in relation to the Cosmos only. When the Cosmos has no existence the extra Cosmic God also cannot be conceived and adored as such. The aspects of Spirit and matter were conceived in the integral whole— the Poornam and the spirit that is responsible for the Unity, harmony and the evolutionary process of the Universe is termed as 'God' Thus God was born by way of manifestation of His own Sakti at the time of the inception of the evolutionary process only and not by uterine birth. He is the all permeating Paraprakruti or Hiranyagarbha. God is therefore not the Absolute, not the Substratum known as the Adhistanam nor the nameless, formless, qualityless Nirvisesha Parabramham who is the nonvibrant prime Causal principle — the Nirguna Karana Bramham— our Atma Tatwam, that which can only be experienced by intuition in a State of Manolayam.

గీర్వాణ పదమగు ఆత్మకు తెలుగున "తాను" అని అర్థము. ఈ తాను సాపేక్షిక పదము (Relative idea) ఉపాధి అనగా దేహము అనేది ఒకటి ఉంటేనే ఈ తానుకు అన్వయము లభించుతుంది. నిరపేక్షిక భూమికయందు (The Absolute plane) ఆ తాను ఎవ్వరని అంటే— "ఆ తాను-తానే" అనవలసి యుంటుంది. అంటే-తానుగాని మరొక తాను ప్రసక్తము గాకూడదనియే భావముగానీ, ప్రాకృతమగు దేహమొకటి ప్రసక్తముగానేరదు. ఫలానా అని మరొక దివ్యతత్త్వమునో ప్రాకృతమగు మూర్తినో పేర్కొన నవకాశముండదు. ఆ నిరతిశయ తాను ఏకైకము,

అద్వితీయమునగు కేవల తత్త్వము మాత్రమేనని గ్రహింపవలయును. ఈ తత్త్వమే ఆత్మ. It is the thing in itself. విధునగు ఈ దానును పొందుటకు ముందు ప్రాతిపదికగ గ్రహించ వలసినది ప్రత్యగాత్మ యనబడు కూటస్థ బ్రహ్మయనియే. ఇదియే సూటియగు సముచితమగు దివ్యతత్త్వము. "ఆత్మానం విజానీయాత్" అను ఆదేశమునకు లక్ష్యము ప్రత్యగాత్మయే. అంటే అనంతమగు పరమాత్మ తత్త్వమునకును ఈ ఈ ప్రత్యక్తత్త్వమగు ప్రత్యగాత్మకును అనన్యతను సత్యమని తెలియుటయే. ఇప్పటికి దేవుని జన్మ వృత్తాంతమును, ఆతని ధర్మములను గురించి ఒక అభిప్రాయమును ప్రాప్తింప కొంటిమి. ఈతడు మాయను ఉపాధిగ గ్రహించి ప్రపంచ విషయముల శాసించుచున్నందున ఈశ్వరుడని పరిభాషించుచున్నాము. ఇందుకు ప్రయోజనము ఉపాసకుల నుద్ధరించుట యేనని తెలియగలము.

## జాతీశ్వర–నియతీశ్వర భావములు.

ఇపుడు వినోదకరమగు మరొక విషయమును ముచ్చటించుకొందము. అది ఈశ్వర తత్త్వమునందు కల్పింపబడిన జాతి భేదము; మరియు ఆయా జాతీశ్వరులకు నియతములైన (Prescribed) అలంకారములు ఆయుధములు వస్త్ర విశేషములను బట్టి వారిని నియతేశ్వరులుగ వ్యవహరించుటయు విచారింతము.

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే"

"ఈశ్వర అల్లా తేరేనాం - సబకో సన్మతి దేరఘురాం"

అను సూక్తులయందలి బోధను 'యదాంతరమ్ న పశ్యామి' అను భావమును

అవగాహన జేసికొని విశ్వసించుటకు పై రెండు పదములను పరిశీలింపవలసి యున్నది. ఏమన — జనసామాన్యమునందు దేవుడన శివుడనియో, విష్ణువనియో, గణపతి యనియో, లేక స్త్రీ రూపమున సంభావించిన- అంబ యనియో, దేవి యనియో, లలిత యనియో భావించి సేవించుట మన అనుభవమునందున్నది. రామకృష్ణాద్యవతారమూర్తులును ఇట్లే దైవతములుగ పూజింపబడుచున్నారు.

Note :— "పుం రూపం వాస్మరేద్దేవిం స్త్రీ రూపం వా విచింత్యయేత్" అను వాక్యానుగుణముగ గాయత్రిని కొందరు స్త్రీమూర్తిగను మరి కొందరు పురుషమూర్తిగను సంభావించి ధ్యానశ్లోకముల రూపొందించుకొని సేవించుచున్నారు. గణేశుని కొందరు పురుషరూపమున సంభావించి వినాయకుడు అని వ్యవహరింప మరికొందరు స్త్రీ రూపమున సంభావించి 'వైనాయకి' యని సేవించుచున్నారు. ఇట్టి స్త్రీరూప విగ్రహములు ఉత్తరహిందూస్థానమున కొన్ని గలవు. పంచవర్ణములతో విలసిల్లు పంచముఖముల గాయత్రి, సద్యోజాతాది పంచముఖములతో విలసిల్లు శివునికి అభిన్న అనన్యతత్త్వమేనని "గాయత్రీ మంత్రః సాక్షాత్ సదా శివపరయేవ" అని కృష్ణపండితుని సంధ్యావందన భాష్యమునందు తెలుపబడియున్నది. ఇది అద్వయ మిథున భావమునకు ప్రమాణవచనమే. మరియు రుద్రాభిషేకానుబద్ధమైన మహాన్యాస పాఠమునందలి శివసంకల్పమున "గాయత్రీ వల్లభాయ నమః" అను అద్వయ మిథున భావ సూచకమగు నామమున్నూ శ్రుతమగుచున్నది. కనుక గాయత్రి ధ్యానమంత్రమున ప్రతిపాదితమైన దైవతము అర్ధనారీశ్వరుడగు సదాశివుడే యను తాత్పర్యము లభించుచున్నది. ఈ స్త్రీ పుం భావములు

స్మార్త వేదాన్తానుసారము ఆభాసికమేగాని తాత్త్వికములుగావు. కృతకములు కల్పితములేగాని సహజములుగావు. వైదిక తాత్త్వికదృష్టికి లింగభేద మసంభావ్యము. కనుక గాయత్రి-సదాశివ తత్త్వములదంపతికి అద్వయ మిథున భావ మున్నదనుటయే అంతరంగికబోధ.

మాయాధిష్ఠిత చైతన్యమునకే ఈశ్వరుడని వ్యవహారము గలదు. ఈయనకే భిన్న నామధేయముల వర్తింపజేసి, శైవ, వైష్ణవ, గాణాపత్యాది జాతి భేదముల గల్పించి పూజించుటచే వీరందరును జాతీశ్వరులుగ (ఒకే జాతికి చెందినవారుగ) పరిగణింపబడుచున్నారు. కాగా— వీరి జాతులకు నియతములైన (prescribed) ఆయుధములు, అలంకారములు, వాహనములు మున్నగు వాటియందలి ప్రత్యేకతలను పరిగణించి 'నియతేశ్వరులు' గను వ్యవహరింపబడుచున్నారు. చూడుడు— ఒకరికి కస్తూరీ తిలకం మరొకరికి భస్మరేఖాలంకారము, ఒకరికి పట్టుపుట్టము మరొకరికి పులి చర్మముతో ఆచ్ఛాదనము; ఒకరికి శంఖ చక్రములు మరొకరికి త్రిశూలాయుధము; ఒకరికి గరుడవాహనము మరొకరికి నందివాహనము నియతములుగ నిర్ణయింపబడినందున వీరు నియతేశ్వరులుగ నిర్ణయింపబడుచున్నారు. ఇట్లు దేవునియందు జాతిభేదములు, వేషభేదములు మానవాభీష్టానుసారము నిర్ణయింపబడి గిరిగీసిన లోకములలో, సింహాసనములపై స్థిరపరుపబడినందున కరుడుగట్టిన మతభేదములకు మూలకారణము లగుచున్నవి. లోకకల్యాణమే సర్వులకు లక్ష్యమైయున్నను, ఎర్ర చొక్కాలో పసుపు చొక్కాలో నియతములై యున్నందున భేద భావప్రాభవమునకు, సరసమునకు బదులు విరసమునకు, ప్రేమకు బదులు ద్వేషములకు, కారణమై పాషండ భావముల

పొదుకొల్పుచున్నట్లు ఈ జాతీశ్వర నియతీశ్వరులు స్వోత్కర్షకు, ద్వేషభావములకు దోహదము చేయుచున్నారేగాని ఆత్మతత్త్వ వివేక ముద్బుద్ధమగుటకు సహకరించుటలేదు.

---

ఇంకను ఈ దైవతములకు భార్యలు బిడ్డలతో సాంసారిక జీవితము ఈ జీవితమునందు రాగద్వేషములకు లోనై చిత్తచాంచల్యముల ప్రదర్శించు ప్రవృత్తి పొసగుట, ఇట్టి ప్రవృత్తి పురాణముల ముఖమున ప్రశంసింపబడి ప్రచారము పొందుట సర్వులకును విదితమైన విషయమే. ఆత్మకు ఇట్టి ప్రవృత్తితో సమన్వయము పొసగదు, సామరస్యము సమకూరదు. ఆత్మ ఏకైక, కేవల తత్త్వము, రాగద్వేషాది జీవధర్మ రహితము, విశేషణ వివర్జితము (Attribute less) అయినట్టి కేవల నిర్గుణ తత్త్వము. అట్టి ఆత్మతత్త్వమునకు స్త్రీ పురుషాది లింగభేదములుండవు ఇంద్రియములుగాని అవయవములుగాని వుండవు. పొడుగు పొట్టి, ఎరుపు, నలుపు అను లక్షణములుండవు. గీతయందు చెప్పబడినట్లు ఆత్మ "సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితం" అయినట్టిది. (13-14) అనగా సర్వేంద్రియ జ్ఞానేంద్రియములుగాని, అంతరింద్రియమగు మనస్సుగాని లేనట్టిదియు, తాను నిర్గుణమైయుండియు మనోబుద్ధుల యొక్క గుణములచే ప్రకాశించునదియు, త్రిగుణముల యొక్క కార్యములగు సుఖదుఃఖములకు సాక్షిమాత్రముగ నుండునట్టిదియు ఈ సర్వ ప్రపంచమును ధరించునట్టిదియు ఆత్మ. ఇంద్రియములకు సంబంధించిన గోళకములు లేకున్నను సర్వమును చూడగలదు, సర్వమును వినగలదు, స్పర్శాద్యనుభూతుల పొందగలదు అని చెప్పబడుచున్నదిగాని నిర్గుణ నిరుపేక్షిక స్థాయియందు వినుట దేనిని

చూచుట దేనిని స్పృశించుట దేనిని ? అను విషయ వివేకమే ఆత్మతత్త్వ ప్రబోధకము. కనుక ఆత్మ A mysterious unseen force అని విశ్వసించవచ్చును. అది నిర్గుణము నిరాకారము, నిరంజనము నిష్క్రియము, అచలము, పరిపూర్ణమునగు పరశివ తత్త్వమే. శివతత్త్వమని నంతనే ఆతడు త్రిమూర్తుల యందలి మూర్తిమంతుడుగ ప్రసక్తమగు శివుడని భావింపబడును. ఈ శివుడు మాయను ఉపాధిగాగల ఈశ్వరుడు మాత్రమే. పరశివుడు ఉపాధిరహిత నామరూపరహిత తత్త్వము మాత్రమే. ఆ తత్త్వమే ఆత్మ యను పదమునకు సార్థకమగు అన్వయమును సముచితముగ తెలుపు పరశివ తత్త్వము.

Atma or Parasiva is the Primal and highest level consciousness known as the Unity consciousness which is the Supra conscious unmanifest principle or 'Druk' which is of the subjective aspect of the Tatwam, who at times can conceive himself as the object to his own self. He is the seer and the knower as well as the seen and known object.

పై చెప్పబడిన పరశివుని సహజశక్తియే ఆదిశక్తి. అది పరబ్రహ్మముయొక్క విమర్శముచే సంభవమగును. ఇందు స్పందన ప్రారంభమైనప్పుడు అది చలనమునకు సమర్థమై యుండును. చలనము ఆవిర్భావమునకు కారణము. ఆవిర్భావమునకు త్రిగుణములు ఉపాదానముగ సుపకరించును. కనుక కారణము కార్యముగ విస్తృతమగుటకు ఇదియే నాంది యనవచ్చును. అపుడు ఇదియే సగుణ కారణ బ్రహ్మగ వ్యవహారమునకు వచ్చును.

This is the Cosmic Kinetic creative manifest consciousness. The idealistic theory in metaphysics explains all phenomena on the basis of consciousness only, where as materialism asserts the primacy of matter or mass for creation. This is the fundamental difference between the two significant words 'Idealism and materialism,' This is a note worthy point for the elucidation and comprehension of the tenets in philosophy and the metaphysical Atma tatwa. A second note worthy point is that the word 'phenomenon' means a natural event but, not the hidden force by which the event was caused. The aim of metaphysics is to comprehend and experience the 1st cause of the phenomenon (ie) the causal principle Atman or Bramhan. Creation begins when Audi Sakti becomes two — the Spirit and matter An extra Cosmic God Can possibly be conceived only when the idea of a world takes shape. What exists otherwise is the Atma Tatwa only in its integral Poorna Bhavam. The Cosmic Kinetic creative chaitanyam is therefore adored as God or 'Devudu' in different shapes of manifestations quite consistently with the differing individual predilictions. Thus have incidiously crept in Idoletry, Zooletry and tombetry to achive personal aspirations and the realisation of Atma tatwa has been receding into the back ground.

తాత్పర్యము :— సగుణభావము పొందిన చైతన్యమునకు ప్రపంచముయొక్క ఉనికి స్ఫురింప, సృష్టికర్తయగు నొక మానవాతీత శక్తిమంతుడు కూడ సంభావింపబడి—దేవుని పుట్టుకయు ప్రసక్తమయ్యెను.

# దృక్ - దృశ్యములు

దృక్ అనగా చూచునది. కనుక ఇది జ్ఞానస్వరూపము. దృశ్యమన చూడబడునది లేక తెలిసికొనబడునది; కనుక జడమని చెప్పబడుచున్నది. ఐనను చైతన్యాంశ స్వల్పమాత్రమునకూడ లేనట్టి కేవల జడమనునది ఉండుట అసంభవము. దృక్ అగు తత్త్వము తనకుతానే దృశ్యముగ సంభవమగుట మాయాశక్తియొక్క ప్రభావమువల్లనేనని గుర్తించుకొనవలయును. ఇదియే శాస్త్రహృదయము. ఈ అంశము అతి గుహ్యమైనది. ఈ భావము అవగాహనగాని వారికి అద్వైతభావము అగమ్యగోచరమే యగును. అంటే- దృశ్యముగ, జడముగ, కనుక అసత్పదార్థముగ పరిగణింపబడు ఈ ప్రపంచము, దృక్ లేక జ్ఞానము అనబడు సదాత్మక తత్త్వమునకు అనన్యమని- కనుకనే "జగద్బ్రహ్మ" అను అనుభూతిని పొందుటకు సాధనయే కర్తవ్యమనియు చెప్పబడినది. The phenomenal jagat is the objective aspect of the Atma. The self, serving as the object to its' own self, Constitutes Vimarsa in sakta sidhanta and the subjective aspect or the seer is known as Prakasam or knowledge Absolute. Thus the self with its two aspects constitutes the integral whole or 'Poornam' of the Advaita school. This idea lends support to the existence of Swagatha Bheda Bhavam in the Saguna Bramha State. This is the fundamental which is quite in conformity with the principle of polarity in modern Physics, and the Ardha Naareeswara in Metaphysics.

"పూర్ణమదః పూర్ణమిదం" అను శ్రుతి వాక్యానుసారము దృక్-దృశ్యములు రెండును తానే యగు ఆత్మతత్త్వమునకు స్త్రీ పురుషాది లింగ భేదములుగాని, నేత్రశ్రోత్రాదీంద్రియములుగాని, వాటికి సాధనములగు గోళకములుగాని ఉండవు. కరచరణాది అవయవము లుండవు. ఆయుధములుగాని అలంకారములుగాని ఉండవు. పూర్వము ఆత్మతత్త్వమునుగురించి గ్రామఫోను రికార్డుకై చేసిన ప్రసంగములో మహాత్మగాంధిగారు "It is a mysterious unseen force" అని చెప్పినట్లు అది కేవలం శక్తి సంభరితమగు ప్రజ్ఞానమే. ఇది ఇంద్రియగోచరము గాదు. దీనిని వాక్కుతో నిర్వచింప వలనుపడదు; ప్రాకృతమగు మనస్సుచే సంభావింపబడదు; కేవలం అనుభూతికిమాత్రమే అనువగు తత్త్వము. అట్టి అనుభూతి సిద్ధించు వరకును ద్వైతభావము తొలగిపోదు. అద్వైతము అను పదము అనుపపన్నము. ఆత్మతత్త్వ సిద్ధియే అద్వైత భావము.

ఇంతవరకును ఈ సృష్టియైన జగత్తుకు మాయాధిష్ఠిత చైతన్యరూపుడగు ఈశ్వరుని, ఆయనకు ప్రాప్తించిన జాతిభేదములను నియతమైన వేష భాషలను విశ్లేషించితిమి. కాగా, ఈ సృష్టికి పూర్వము జడ స్వరూపమో చైతన్యస్వరూపమో అగు ఉపాదానపదార్థ మొకటి యుండెనా లేక శూన్యము నుండే ఈ జగత్తు ప్రభవించెనా ?

జగదుత్పత్తికి ఉపాదాన మేది ? యన —

"సదేవసోమ్య ఇదమగ్ర ఆసీత్ । ఏకమేవాఽద్వితీయం" అను శ్రుతి వాక్యానుసారము అనాదినుండియు, సనాతనమైయుండియున్న అనంత, అచల, పరిపూర్ణ తత్త్వ మొకటి యుండెను. అది మరొక భావపదార్థమునకు

ఉనికి కల్పింప వీలుపడని పూర్ణము సమగ్రమునగు కేవల సత్పదార్థము. కనుకనే అప్పటికిని మరెప్పటికిని తా త్త్వికమగు మరొక పదార్థమున కునికి యుండుట అసంభావ్యము. అందువలన ఈ సృష్టికి పూర్వమున్న సనాతన తత్త్వమే "సత్". అదియే 'ఆత్మతత్త్వము'. అదియే పశ్చాదాత్మ. పశ్చాత్ అనగా తరువాత. దేని తర్వాత అందురా ? కర్మయోగముచే చిత్తమాలిన్య ముల ప్రక్షాళనముజేసి జ్ఞానయోగముచే సత్ స్వరూప మెట్టిదో అవగాహనము పొంది, అంతర్ముఖుడై, అమనస్కుడైనవానికి సిద్ధించునట్టిదే ఆత్మతత్త్వ స్వరూపసిద్ధి. అదే పశ్చాదాత్మ.

పశ్చాదాత్మ అనంతము అపారము అనగా దీనికి అంతులేదు హద్దులు లేవు; పాలించుటకు లోకములుగాని, ఆవాసమునకు పురములు అంతఃపుర ములుగాని యుండవు ఈతడు కొబ్బరికాయలు కోరడు, ఫలప్రదానముల జేయడు; కోరిన కోర్కెల తీర్చడు; పెట్టినవారియెడల దయాదాక్షిణ్యము లుండవు, పెట్టనివారియెడల ద్వేషభావము గలుగదు. మన మెంత స్తుతిం చినా ఆతడు మౌనవ్యాఖ్యతో చిన్ముద్ర సూచనతో చెప్పున దొక్కటే— పారమార్థిక క్షేత్రమున వ్యవసాయాత్మక కృషి సల్పుము, జ్ఞానఫలమును నీవే సృష్టింపగలవు, పదిమందికి పంచి ఇవ్వనూగలవు అనగా నాదివ్య ధర్మముల పొందగలవు. ఈకృషి ఎట్టి దందువా ? ఆత్మతత్త్వ విచార ణయే; విచారణకు విధాన మెట్లందువా ? కస్త్వం = నీవు ఎవరివి; కోహం = నేను ఎవరిని ? కుత ఆయాతా ? = ఎట్లు రూపొంది ఇచ్చటికి వచ్చితివి ? కుత్రగమిష్యామి = ఏది లక్ష్యము ఏది గమ్యము ? ఎచటికి పోవుట ? అను విషయముల గురువేదాంతవాక్య శ్రవణములచేతను,

మననము చేయుట, నిదిధ్యాసనము చేతను గ్రహింపవలయును. ఇందుకు సాధనములు, గీతయందు ప్రధానముగ ప్రవచింపబడిన కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠలే. పతంజలి ప్రవచించిన అష్టాంగ యోగనిష్ఠ అనుబంధ ప్రయోజనకారి మాత్రమేనని జ్ఞాననిష్ఠను విశ్వసించిన పెద్దలందురుగాని- నా అనుభవములో ఈ అష్టాంగ యోగపూర్వక రాజయోగము అత్యంత ఆవశ్యకము, ఆచరణీయ మును ఈ సాధన లేనివారికి అమనస్కస్థాయి అసాధ్యము, అసంభవమేనని విశ్వసింతును.

సాంఖ్యమన జ్ఞానబోధ యనియే పండితులు ప్రవచింతురు. కానీ, జగన్నిర్మాణము 25 తత్త్వములచే జరుగుచున్నదని సాంఖ్యులు, 36 తత్త్వ ములతో జరుగుచున్నదని శాక్తేయులును తెలుపుచున్నారు. నిర్మాణాత్మక తత్త్వముల సంఖ్యను దెలుపుచున్నది గనుక ఈ శాస్త్రమున్కు సాంఖ్యమనియే వ్యవహారమునందున్నది. దీనికి కపిలసాంఖ్య మని ప్రసిద్ధనామము. దీనిని గీతయందు భగవాను డిట్లు నిర్వచించి యున్నాడు.

శ్లో॥ భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా (7-4)

అని పృథివ్యాది పంచభూత తన్మాత్రలను, మనస్సు, దానికి కారణమగు అహంకారము, అహంకారమునకు కారణమగు మహత్తున్ను కలిపి ఇవి ఎని మిది విధములగు నా ప్రకృతులని ఏడవ అధ్యాయమున భగవానుడే చెప్పి యున్నందున దీని విచారణ ఆవశ్యకమని ఇది తెలియనివారికి నిత్యానిత్య వస్తువివేకము ప్రాప్తించదనియు గ్రహింపవలసి యున్నది.

ఇది తెలిసిన పిమ్మటనే—

శ్లో॥ జ్ఞానం తేఽహం స విజ్ఞాన మిదం వక్ష్యామ్య శేషతః
యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే. (7-2)

భావము :- ఏ జ్ఞానము తెలిసికొనిన పిదప ఈ లోకమునందు తెలియదగిన ఇంకొక విషయ ముండదో అట్టి స్వానుభవముతోగూడిన విజ్ఞానమును నీకొరకు చెప్పుచున్నాను అని భగవానుడు చెప్పెను.

This is why I, for myself, am both a materialist and a spiritualist as well, in the integral sense.

శ్లో॥ ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభి ధీయతే ।
ఏతద్యో వేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః (13-1)

శ్లో॥ క్షేత్రజ్ఞం చ మాంవిద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్ర క్షేత్రజ్ఞ యోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ॥ (13-2)

భావము : ఈ శరీరము ఆత్మకాదు ! ఇది క్షేత్రము దీనియందంతర్యామియై దీనిని తెలిసికొను తెలివియే క్షేత్రజ్ఞుడు. ఈతనికే ఆత్మయని హిరణ్యగర్భుడని పేరు. ఈ క్షేత్రజ్ఞునకును, పరతత్త్వము నగు నాకును అభేదమేగాని భేద మెంతమాత్రమును లేదు. "I and my father are One" అని ప్రభు క్రీస్తు ప్రవచించిన పదభావ మిదియే. ఇందు గ్రహింపనగు సూక్ష్మమేమన క్షేత్రములు అనేకములైనను సర్వచరాచర క్షేత్రములయందును అంత ర్యామియై, క్షేత్రజ్ఞుడు, ప్రత్యగాత్మ, కూటస్థుడు అను పర్యాయములతో వ్యవహరింపబడు తత్త్వము మాత్రము ఒక్కటియే. ఎట్లన— సర్వ క్షేత్రేషు (క్షేత్రములయందు అనునది బహువచనము కనుక క్షేత్రములు పెక్కుసంఖ్యలో యుండ- క్షేత్రజ్ఞం చ మాంవిద్ధి యని ఏకవచన ప్రయో గము చెప్పబడినది. కనుక క్షేత్రసంబంధమగు జ్ఞానము. 1. సత్-అసత్తు లను వివేచించి సదాత్మకమగు ఆత్మతత్త్వలాభము ప్రాప్తించుకొన సహాక

రించును. 2. ఈ క్షేత్రజ్ఞతత్త్వమును ఏకాత్మరూపముగ పరతత్త్వముగ దెలిసుకొన సహకరించును.

ఇక ప్రాగాత్మ విషయ విచారణ జేయుదము.

---

'ప్రాక్'- అనగా ముందు. దేనికి ముందు? అష్టాంగ యోగ సాధనతో అవిద్యా అస్మితాది చిత్తమాలిన్యముల పోగొట్టుకొనుటకు ముందున్నట్టి, అజ్ఞానస్థితియందలి ఆత్మ. ఈతడే జీవాత్మ. కనుక ఆత్మతత్త్వ మీమాంసచే జ్ఞానతత్త్వముగ అనుభూతి పొందదగినది పశ్చాదాత్మ. జ్ఞానమీమాంసకు పూర్వము అజ్ఞాన భూమికయందు వ్యవహరింపబడునది ప్రాగాత్మయనియు తాత్పర్యము. పశ్చాదాత్మ సత్యజ్ఞానానంద స్వరూపుడనుట పారిభాషిక ప్రవచనము. ఈతడు "పూర్ణాత్పురుషః" అను శ్రుతివాక్యముచే— "అదః (అది) - ఇదం (ఇది)" అను రెంటి విషయక జ్ఞానముచే పూర్ణత్వమును ప్రకటించును. ఎవ్వరా పూర్ణపురుషుడు అందురా? 'ఆయన ఆయనే'— స్వస్థుడు. అనగా స్వస్వరూపమునందే స్థితమై యుండువాడు—the thing in itself or the substratum అగుచో- ఈ అచల, నిర్గుణ, నిష్క్రియాత్మక, కర్తృత్వరహిత, తత్త్వమునుండి, ఈ సృష్టియు, దానిని ప్రవర్తింప జేయ, నొక ఈశ్వరుడును ఎట్లు సంభవమయ్యెను? అన- అట్టి అచల తత్త్వమునందొకప్పుడు "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" అను స్పందన అకర్తృకముగ సంభవముకాగా చలనము ప్రాప్తించెను. చలనము, ఆవిష్కరణ హేతువగును గనుక సృష్టి సంభవమయ్యెను. ఇది నానాత్వ పూర్వకము. ఈ నానాత్వమును పాలించుటకు దేవుడు సంభవమయ్యెను. సృష్టికి ఈతడు నిమిత్తకారణముకాగా (intelligent cause) త్రిగుణాత్మక

మగు మాయ పదార్థమునకు చెందినది గనుక ఉపాదానకారణమై పలువిధముల పరిణమింప ఈ దృశ్యప్రపంచము ప్రాప్తించినది. ప్రపంచమన చక్కగా పంచీకరింపబడి మరల పంచీకరణ ప్రక్రియచే ప్రాప్తించినట్టిదని భావము. ఈ నానాత్వమును అనుస్యూతముగ సృష్టించుచు పాలించుచు లయింప జేయుచు, జీవుల కర్మఫలానుభవముల ననుభవింపజేయుటకు దేవుడు సంభవమయ్యెను. ఈతడే మాయావచ్ఛిన్నుడగు ఈశ్వరుడు. ఇది జీవేశ్వర జగత్తత్త్వముల చరిత్ర.

ఇట్లు ఈ తత్త్వములు మూటికిని అధిష్ఠానమగు ఆత్మతత్త్వమును శాస్త్రదృష్ట్యా అవగాహన జేసికొనుటకు పరిశీలింపవలసిన విధానములు :

1. అవస్థాత్రయ వివేకము
2. ప్రత్యభిజ్ఞా విధానము
3. మాయావాద వివేకము.

I. అవస్థాత్రయ వివేకము : అవస్థాత్రయ మంటే 1. మనం మెలకువతోయుండి లోకవ్యవహారముల నిర్వహించుచుండుట. 2. స్వప్నావస్థ అంటే కలగనునప్పుడుండే స్థితి. దీనియందు పదార్థములున్నట్లే కనిపించుతవిగాని రాశిరూపమున అనుభూతి నివ్వవు. తెలివి యుంటుందిగాని, అది మెలకువ అనగా జాగ్రత్తునందలి తెలివి వంటిదిగాదు. 3. సుషుప్త్యవస్థ అంటే ఘాఢమైన నిద్రయందలి స్థితి.

ఈ చెప్పబడిన మూడవస్థలు మన నిత్యజీవితమునందు అనుభవిన మున్నా అనుభవమునకు వస్తూవుంటవి గనుక— వీటిని ప్రాతిపదికగ తీసుకుని రాజగుహ్యమగు రాజవిద్యను సిద్ధాంతరీత్యా గ్రహించుట సులువగుచున్నది. ఈ అవస్థాత్రయ పరామర్శకు ఆత్మస్వరూపము సూచితమగుటయే ప్రయోజనము; విచారింతము.

అవస్థాత్రయ వివేకమునకు పునాదులు మాండూక్యోపనిషత్తునందు వేయబడియున్నవి. ఇందు పరమాత్మకు పాదచతుష్టయమును విశ్లేషణతో వివేచించి బోధనాసౌకర్యమునకుగాను పొందుపరచబడినవి. ఈబోధ పరమాత్మ స్వరూపబోధకము. దీనికి సహకారబోధగ బ్రహ్మప్రతిపాదకమగు ప్రణవముకూడ పాదచతుష్టయ కల్పనతో అభివర్ణింపబడియుండు టొక సాధనముగ సహకరించుచున్నది.

ప్రణవప్రతిపాదక చైతన్యమునకు నాలుగు దశలు కలవనియు, ఈ దశలపై ఆధిపత్యము వహించు చైతన్యము విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తురీయ స్థాయిలలో ప్రవృత్తి సాగించుచుండుననియు మాండూక్యబోధ

1. జాగ్రదవస్థాభిమానియైన జీవాత్మను బ్రహ్మమునకు మొదటి పాద మనిరి. ఈతడే విశ్వుడు లేక వైశ్వానరుడు. ఇది వ్యష్టిని పరిగణించి నప్పటి పేరు. సమష్టిని (జాగ్రదవస్థను స్థూలదేహమును) పరిగణించినప్పుడు ఈతడే విరాట్ అని వ్యవహరింపబడును. ఎవ్వడీ స్థూలప్రపంచ భోక్తయై యున్నాడో అంటే దానిని అనుభవించుచు తెలిసికొనుచున్నాడో ఆతడే విశ్వుడు లేక వైశ్వానరుడు.

2. స్వప్నావస్థయందు సూక్ష్మశరీరాభిమానియైన జీవాత్మను తైజసు డనిరి. తేజస్సంబంధమగు పదార్థముతో రూపొందిన దేహియని భావము. సమష్టిస్వరూపమునం దతడు హిరణ్యగర్భు డనబడుచున్నాడు. హిరణ్మయమన బంగారము గాదు, ఇచట జ్ఞానమని అన్వయించవలెను. స్వరూపతః సూక్ష్మ శరీరి, స్వభావతః జ్ఞానసంభరితుడు కనుకనే హిరణ్యగర్భుడని వ్యవహారము. సూక్ష్మశరీరమునందు సమస్తమునకును నియంత, జ్ఞాత, భోక్తయునగు నీతడే పరమాత్మకు రెండవ పాదముగ పేర్కొనబడినాడు.

3 ప్రగాఢనిద్రయందు (సుషుప్తియందు) కారణశరీరాభిమానియై-స్థూలసూక్ష్మజగత్తులయందు విశ్వతైజస నామములతో తాను పొందిన అనుభూతుల నిపుడు పొందకయే, తన ఉనికికి సరియగు సుఖానుభూతినిమాత్రము పొందుచుండు స్థితియే సుషుప్తి. ఈస్థితియం దాతనిపేరు ప్రాజ్ఞుడు. జగత్తు యొక్క కారణస్థితియగు ప్రళయకాలమున కలుగు అనుభూతికి తుల్యమగు అనుభవమునుమాత్రమే ఈతడు పొందుచుండును. జగత్తునందలి నామ రూపము లీతడికి వ్యక్తముగావు. ఇట్టి ప్రకృతి ఎవనికి ఉపాధిగ సంభవమగుచున్నదో అట్టి యీప్రాజ్ఞుడే పూర్ణబ్రహ్మకు మూడవ పాదమని దెల్పిరి.

ఈ బోధకు కొలికిపూసవంటి సందేశమేమన— ఇచట ప్రతిపాద్యమైన పరబ్రహ్మకు, ప్రతిపాదకమైన ప్రణవమునకును అనన్యత అనగా, తాదాత్మ్యభావము నారూఢము జేసికొనుటయే.

పరబ్రహ్మముయొక్క స్వరూపనిరూపణమును జేసి తెలుపుటకై ఆయన అభివ్యక్తి విధాన భేదములను దృష్టియందుంచుకొని శ్రుతులు ఆయనకు నాలుగుపాదము లున్నట్లభివర్ణించిరి.

సర్వజ్ఞత్వము అనబడు ప్రజ్ఞచే సర్వదా సంభరితుడైయున్నందున ప్రాజ్ఞపదము పరమేశ్వరునకును అన్వయమగుచున్నది. సుషుప్తియందలి వ్యష్టియగు ప్రాజ్ఞుడే సమష్టిస్థాయియందు అవ్యాకృతుడనబడు చున్నాడు. కాగా, తురీయుడన చైతన్యస్వరూపమున ప్రకాశించు తత్త్వము. ఇది సంప్రజ్ఞాత సమాధిస్థాయి. అసంప్రజ్ఞాత లేక నిర్బీజస్థాయియందు యీతడు కేవల పరబ్రహ్మానుభూతియే యగును.

ప్రణవము అ-ఉ-మ అను మూడక్షరములు లేక మాత్రలతో (శబ్ద విశేషములు లేక syllables) ప్రవచింపబడుచున్నందున "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అను శ్రుతివాక్యమున కనుగుణముగ ఆమూడును ఏకాక్షరముగనే ప్రవచింపబడుచున్నది. ఇది కేవలం బ్రహ్మప్రతిపాదకమనియు, వాగ్రూపముగ పరిగణించినయెడల- "తస్యవాచకః ప్రణవః" (దాని పేరు ప్రణవము) అని శ్రుతివాక్యము నిర్ధారించినది. పరావాక్కే పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి అనబడు స్థూలరూపానుక్రమములో ఈ నామరూపాత్మకప్రపంచముగ నభివ్యక్తమగుచున్నది. ఈ క్రమములో కడపట ప్రాప్తించనగునదియే తురీయము లేక మాత్రారహితమైన నాల్గవస్థాయి. కనుకనే ఓం! అను నొక అక్షరము బ్రహ్మప్రతిపాదక మగుచున్నదనియు మాండూక్యమునందలి పరమబోధ. ఇందుగల 12 మంత్రములకును శ్రీ గౌడపాద గురుదేవులు రచించిన కారికలు అద్వైతసిద్ధాంత మూలసూత్ర బోధకములుగ పరిగణనకు వచ్చి మాన్యములైనవి.

ఇట్టి విశిష్టగ్రంథమగు మాండూక్యమునగల తత్త్వసారమును గ్రహించిన, ఆత్మతత్త్వనిరూపణకు మనకు ప్రాతిపదికగ గ్రహించబడిన అవస్థాత్రయము యొక్క ఔచిత్యము అవగాహనకు రాగలదు. ఎట్లన— ప్రణవ ప్రతిపాద్యచైతన్యమున జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, తురీయము అను దశలు నాలుగనీ గ్రహించి- ఇందు మొదటి మూడు దశలయందును ఆయా దశ నభిమానించి, ఆధిపత్యమువహించు చైతన్యపురుషుడు, విశ్వ, తైజస, ప్రాజ్ఞ నామ రూపములతో ఈ విశ్వమునందలి వ్యవహార నిర్వహణము జరుపుచుందు రనుటయే గ్రాహ్యాంశము.

ఈ అవస్థాత్రయవిషయము సామాన్యముగ ప్రతి వేదాన్త ప్రకరణ గ్రంథమునందును సమకూర్పబడియే యున్నది. ఐనను మాండూక్యము నందు ప్రణవప్రతిపాద్యచైతన్యమున జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయములను నాలుగు దశలను వివరించి, ఆయా దశలయందాధిపత్యము వహించు విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తురీయ రూపములతో తెలియబడునట్టి వారందరు ఒకే స్వరూపమునకు చెందిన అంశలుమాత్రమే ననియు నిర్దేశించి తెలుపబడినది. ఇచ్చట ప్రతిపాద్య ప్రతిపాదితములగు పరబ్రహ్మకును, ప్రణవమునకును అనన్యతాభావమున్ను సిద్ధాంతీకరింపబడియున్నది. ఇందు తురీయము ప్రపంచోపశమరూపమైన శివుడే యనియు ప్రస్ఫుటించి తెలిపియుండిరి. ఈస్థాయికి పూర్వము ప్రసక్తమైన విశ్వ, తైజస, ప్రాజ్ఞ రూపములతో వ్యవహరింపబడిన తత్త్వములును ఆ పరమపురుషుడగు పూర్ణబ్రహ్మయే ననియు మాండూక్య బోధ. కనుక ఆత్మ యనునది స్వరూపతః ఒకే ఒక తత్త్వమని పరమార్థతః పర్యవసించినది. ఓంకారము బ్రహ్మముయొక్క నామమగుటచే ఆయనకు భిన్నమైనది గాదు. కాగా, ఈ రెంటికినిగల సంబంధము వాగర్థములకు గల సంబంధమే. అనగా, పరమాత్మయను పరతత్త్వమునకు ఓంకార మభిధేయము మాత్రమే. ఓంకారమునకును పరమాత్మకును నాల్గు నాల్గు పాదముల విశ్లేషణతో వివరించి చేయబడిన తులనాత్మకబోధయే మాండూక్యమునందలి విశిష్టత.

ఈ చర్యయందలి తాత్పర్య మేమన— దేహధారులకు నిత్యము ప్రాప్తించు అవస్థాత్రయమునందనుభూతులబొందు జీవచైతన్యము భిన్న భిన్న నామరూపములతో పేర్కొనబడియున్నను అన్నింటియందును సూత్ర ప్రాయముగనున్న ఆత్మతత్త్వము మాత్రము ఒకటే ననుట.

ఇక ఈ త్రివిధ అవస్థలయందును ప్రాప్తించు ప్రవృత్తులు అనుభూతులను పరిశీలింతము.

ఇపుడు ఈ మూడవస్థల యందలి ప్రవృత్తి పద్ధతులను వివేచించుదము.

1. జాగ్రదవస్థ : ఇది ఇంద్రియముల మాధ్యమముతో బాహ్య విషయముల గ్రహించు స్థితి. చూచుట, వినుట, రుచి నెరుంగుట, స్పృశించి గ్రహించుట, వాసనజూచుట అనునవి.

పంచ జ్ఞానేంద్రియముల కార్యములు. ఈ కార్యములచే దృశ్యము యొక్క స్వరూప స్వభావముల జ్ఞానముపొంది, దానిని మనస్సునకు బుద్ధికి నివేదించుటయే లక్ష్యముగ దెలియబడుచున్నది. ఇది ప్రధానముగ స్థూల శరీరమునకు సంబంధించినది. దీని నభిమానించు దేహి విశ్వు డనబడును.

2. స్వప్నావస్థయందు ఆత్మ సూక్ష్మశరీరము నభిమానించును. ఈ యవస్థలో ఇంద్రియము లుపసంహృతములై బాహ్యప్రపంచ విషయముల గ్రహింపనేరవు. కానీ తనకు అంతరమగు మరొక ప్రపంచము సృష్టియై లోకవ్యవహారములు జరుగుచున్నట్లే యుండును. విమానముపై విదేశ సంచారముల జేయటం, మేడ ఎక్కటం, సంతోషపడటం, కాలుజారి పడటం, ఆస్పత్రికివెళ్ళటం. వేదనకు దుఃఖపడటం, సర్వము జాగ్రత్తునందు వలెనే నుండును. కాని, ఇవి నిజముగావు, స్థిరముగావు. కేవలం మానసికోత్తేజమువలన ప్రాప్తించు దృశ్యములే గనుక, మెలకువ వచ్చినంతనే అవి మాయమగును. కాని, జగత్తునందలి దృశ్యములు స్థిరముగా నుండునట్లు స్వప్నమునందలివి ఉండనందుననే జాగ్రత్ స్వప్నములు విభజించి తెలియ

బడుచున్నవి. స్వప్నావస్థయందు కొన్ని గమనీయములగు విషయము లున్నవి. ఏమన —

a) ఈ సుఖదుఃఖముల ననుభవించువాడే ఆ అనుభూతులకు సాక్షిగా నుండుట.

b) ఘన పదార్థములగు ఇటుక, సిమెంటు, ఇనుము మున్నగునవి లేకున్నను అందలి భవనములు వాటివల్లనే నిర్మింపబడినట్లుండుట, అంటే రాశిభౌతికముగ లేకున్నను ఉన్నట్లే స్ఫూర్తినిచ్చుట.

c) కలగనునాతడు, జాగ్రత్తునందున్నవానివలె ఆ దృశ్యములు, అనుభూతు లన్నియు సత్యములేనని విశ్వసించునుగాని అవి మిథ్యామాత్రములే యని సంభావింపడు.

వింతగాదోచు ఈమూడు విషయములును స్వప్నావస్థకు, తత్త్వశాస్త్రమునందు ప్రముఖస్థానము కల్పించుచున్నవి. ఎట్లన— నిద్రనుండి మెలకువరాగానే స్వప్నజగత్తునందలి పురుషునకు ఆ జగత్తు లేకుండ పోవునట్లు- జాగ్రత్తునందలి వారికినీ బ్రహ్మజ్ఞానము అనుభూతి అయినంతనే ఈ జాగ్రత్ప్రపంచము రాశిరూపమున గోచరించుచు రాశి (పదార్థము-matter) యొక్క లక్షణముల (properties of matter) ప్రదర్శించుచున్నను, ఇది లేనిదేయని అంటే- మిథ్యామాత్రముగ తెలియబడునని బోధించుట కుపకరించుటయే స్వప్నావస్థయొక్క ప్రయోజనము. వేదాన్తశాస్త్రమున ప్రముఖముగ స్వప్నావస్థ ప్రసక్తమగుటకు కారణమును. N. B. : జ్ఞానికి దృశ్యప్రపంచము నిత్యసత్యము గాదను తాత్త్వికబోధను మనము గ్రహింపవచ్చునుగాని, అసలు దృశ్యముయొక్క స్వరూపనాశము సంభవము గాదనియు, జ్ఞానికిదక్క మిగిలిన అజ్ఞానులందరకు అది అట్లే యుండుననియు అనుభవమున తెలియబడుచున్నది. ఇది మననయోగ్యమగు విషయము.

ఇక తెలియవలసిన విషయమేమన— స్థూలశరీరాధిష్ఠితుడై, జాగ్రదవస్థయందు విశ్వుడను పేరుతో వ్యవహరింపబడు నాతడును, సూక్ష్మశరీరాభిమానియై స్వప్నప్రపంచమున తైజసుడను పేరుతో వ్యవహరింపబడు పురుషుడును సుషుప్తియందు వ్యవహరించు ప్రాజ్ఞుడును వేరువేరా? లేక ఒక్కడేనా? అని. అవస్థాభేదములబట్టియు, వారభిమానించు స్థూల, సూక్ష్మ, కారణ శరీరభేదములబట్టియు పేర్లు వేరై యున్నను, నిస్సందేహముగ ముగ్గురును సాజాత్య, అనన్య, ఏకైక తత్త్వమునకు చెందినవారనుటయే అవస్థాత్రయ విచారణకు ప్రయోజనము.

జాగ్రదవస్థయందున్నప్పుడు స్వప్నప్రపంచముగాని అందు వ్యవహరించు సూక్ష్మశరీరముగాని లేనివే అయినట్లు, స్వప్నావస్థయందు జాగ్రత్ప్రపంచముగాని అందు వ్యవహరించు స్థూలశరీరముగాని లేనివే అగుచున్నవి. ఇట్లు జాగ్రత్స్వప్నములు రెండును ఒకటి వ్యవహారమునందున్నప్పుడు రెండవది అద్రష్టకు లేనిదై ఇతరేతర మిథ్యాసంపాదకము లగుచున్నవి. ఆత్మ అనబడు జ్ఞానరూపతత్త్వము అనన్య అనంతతత్త్వ మగుటయే ఈ విచారణకు మౌలికమగు గ్రాహ్యాంశము. అవస్థాత్రయమునందు ఆత్మ సాక్షిమాత్రుడే నను సిద్ధాంతమున్ను నిర్ధారింపబడుచున్నది. పరమాత్మకు పైస్థాయి చైతన్య స్వరూపమగు పరబ్రహ్మమునకు మాత్రము ఈ సాక్షిత్వము సమన్వయింపబడజాలదని నా అభిప్రాయము. ఆత్మాశ్రయ (subjective) దృష్టితోగాక వస్త్వాశ్రయదృష్టితో తనకుతానే సాక్షి కాగలడు. వస్త్వాశ్రయ దృష్టి కలుగని ఆత్మకు సాక్షితత్త్వ మెట్లు పపన్నమగును?

**3.** సుషుప్త్యవస్థ : అనగా గాఢనిద్రావస్థ. ఇందు ఇంద్రియములేగాక మనస్సుకూడ ఉపసంహృతమైయుండును. కనుక చిత్తవృత్తులు

సంభవముగావు. అందుచే ఆనందానుభూతిమాత్రమే సంభవమగును. ఈ ఆనందానుభూతి సుషుప్త్యనంతరం స్మృతిమాత్రమై యుండును. ఈ అవస్థ యందు జాగ్రత్స్వప్న ప్రపంచములు రెండును లేనివే యగును. ఈ అవస్థలు మూటియందును ఆత్మయగు "నేను" మాత్రము అనుస్యూతముగ సాక్షియై ఉనికి గలిగియుండు ఏకైక తత్త్వమని తాత్పర్యము.

పై భావములను శ్రీ విద్యారణ్యుడు పంచదశిలోని తత్త్వవివేక ప్రకరణమున ఆత్మతత్త్వమునకు వర్తించి ఇట్లు బోధించెను.

శ్లో॥ శబ్దస్పర్శాదయోవేద్యాః వైచిత్ర్యాజ్జాగరేపృథక్ ।
తతోవిభక్తా తత్సంవిదైకరూప్యా నభిద్యతే ॥

శ్లో॥ తథా స్వప్నేఽత్రవేద్యంతు నస్థిరం జాగరేస్థిరమ్ ।
తద్భేదోఽతస్తయో స్సంవిదేకరూపా నభిద్యతే ॥

శ్లో॥ సుప్తోత్థితస్య సౌషుప్తమో బోధో భవేత్స్మృతిః ।
సచావబుద్ధ విషయంఽన బుద్ధం తత్తదా తమః ॥

శ్లో॥ న బోధ విషయాద్భిన్నో న బోధాత్స్వప్న బోధవత్ ।
ఏవం స్థానత్రయేఽప్యేకా సంవిత్త ద్వద్దినాంతరే ॥

శ్లో॥ మాసాబ్ద యుగకల్పేషు గతాగమ్యేష్వనేకధా ।
నోదేతినాస్తమేత్యేకా సంవిదేషా స్వయంప్రభా ॥

పై ఈ శ్లోకముల భావములు మన మైనందిన జీవితమునందు అనుస్యూతముగ సంభవమగు అవస్థాత్రయ భావముల కాలంబనమును సంతరించి యిచ్చుచున్నవి. పరిశీలింతము.

శ్లో. 1. జాగ్రత్ స్థితియందు వైచిత్ర్యమువలన శబ్దస్పర్శాదులు వేరుగా తెలియబడవలసి యున్నవి. వాటికన్న భిన్నమైన "తత్" జ్ఞానం "సంవిత్" ఏకాకారముగ భాసమగుచున్నందున వాటికన్న వేరుకాదు.

శ్లో. 2. అట్లే స్వప్నావస్థయందు దృశ్యమానమగు వస్తుజాలమున్న స్థిరమే. స్థిరత్వ అస్థిరత్వ లక్షణరూపమైన భేదము వానియందున్నది. సంవిత్- అనగా జ్ఞానముమాత్రము ఏకాకారమే, భిన్నము కానేరదు.

శ్లో. 3. నిద్రనుండి లేచినవానికి సుషుప్తి కాలమందలి జ్ఞానము యొక్క బోధ స్మృతిరూపముగ కలుగుచుండును. ఆ స్మృతి అనుభూతి విషయమై అజ్ఞానమును విషయముగా గలిగిన దగుచున్నది. అందుచే సుషుప్తిసమయమున ఏమియు తెలియబడలేదను అజ్ఞానము అపబుద్ధమగు చున్నది.

శ్లో.4. సుషుప్తియందు అజ్ఞానమును విషయముగజేసికొని ఆబోధ సంవిత్ జ్ఞేయాజ్ఞానముకన్న వేరైనది. స్వప్నమునందు విషయములను తెలిసికొను జ్ఞాతృరూపమగు సంవిత్వలెనే మరొక జ్ఞానమునందు వేరుగాదు. ఈవిధముగ జాగ్రదాద్యవస్థలు మూటియందును జ్ఞాతమగు సంవిత్ ఒక్కటియే. అట్లే దినాంతరమందుగూడ జ్ఞాతమగు సంవిత్ ఒక్కటియే.

శ్లో. 5. బహువిధములైనట్టి భూతభవిష్యత్కాలికములగు మాస, అబ్ద, యుగ, కల్పములందుకూడా జ్ఞాత (సంవిత్) ఒకడే. అది అస్తమించదు, ఉదయించదు. అది స్వయంప్రభ. సర్వకాలములయందును ఉనికిగల తత్త్వమే ఆత్మ.

ఇప్పటికి అవస్థాత్రయ ప్రాతిపదికతో ఆత్మతత్త్వమును కొంత గ్రహించితిమి. ఇక ప్రత్యభిజ్ఞాదృష్టితో మరికొంత గ్రహింతము.

ప్రతి సిద్ధాంతమునకును ప్రమాణవచన మవసరము. కనుక ఉపనిషద్వాణి ప్రమాణముతో ఆత్మతత్త్వమును నిర్ధారింతము. మన వ్యాపహారికానుభవమును బలపరచుకొందము.

## 1. ఉపనిషద్వాణి - ఆత్మతత్త్వము

శ్లో॥ యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ।
యచ్చాస్య సంతతో భావః తస్మాదాత్మేతి కథ్యతే॥
(కఠ - శంకరభాష్యము)

ఇది ఆత్మతత్త్వమును సుస్పష్టముచేయు నిర్వచనము. వ్యుత్పత్త్యర్థముల ననుసరించి చెప్పబడినందున సుబోధకము సుగ్రాహ్యముగ నున్నది. పరిశీలింతము.

**1. ఆప్నోతి ఇతి ఆత్మా :** ఆప్నోతి యన పొందునది. దేనిని పొందుట ? అన- నిద్రాకాలమున అంతఃకరణ వృత్తుల నుపసంహృతము జేసికొని, తిరోభావ విధానమున అజ్ఞానము పొందునది ఆత్మ. (Ignoring the knowledge of the external— by a process of involution). ఈ తిరోముఖ విధానమువల్ల ఆత్మకారణ శరీరము నభిమానించి ఆనందమును మాత్రము పొందును. ఇది సుషుప్త్యవస్థకు చెందును. ఇందలి పురుషుని ప్రాజ్ఞు డందురు. ప్ర + అజ్ఞః = ప్రాజ్ఞుడు. అనగా ఇంద్రియము లుపసంహృతములైనందున బాహ్యవిషయముల తెలియనివాడని అర్థము. ఇది

ప్రమాతృ దృష్టితో చెప్పబడు భావము. ప్రమాత యన జీవుడే. జీవుడు అవిద్యతోకూడిన వాడైనందున ప్రాజ్ఞుడను పదము అజ్ఞానమున కన్వయ మగుచున్నది. మరొక భావముకూడా అనువర్తనీయమై యున్నది. ఏమన— "ప్రజ్ఞయేవప్రాజ్ఞః" ప్రజ్ఞయన జ్ఞానము. సర్వప్రజ్ఞా సంపన్నుడగుటచే జ్ఞానస్వరూపుడని ఆత్మభావమునకు అన్వయించవచ్చును. అంటే స్వరూపతః, స్వభావతః సర్వజ్ఞుడైనవాడే అవిద్యావచ్ఛిన్నుడైనందువలన అజ్ఞానివలె ప్రవృత్తి పొందుచున్నాడను తాత్పర్యము లభించుచున్నది.

2. ఆదత్తే ఇతి ఆత్మ : ఆదానమనగా గ్రహించుట. దేనిని గ్రహించుట ? ఏది జాగ్రదవస్థయందు తనకు గలిగిన అనుభవములను వాసనలను గ్రహించి (formation of instincts) ప్రతిష్ఠించుకొని, నిద్రాకాలమందు వాసన లుత్తేజితములుకాగా అవి స్వప్నములుగ సంభవ మగును. ఇట్టి స్వప్నముల విషయమున ఒక సూక్ష్మమును మనము గ్రహించ వలసి యున్నది. ఏమన— స్వప్నప్రపంచము కలగనువానికి అంతరమున నున్నదా ? బాహ్యమున నున్నదా ? లేక అంతరముగ నుండియు, బాహ్యము గనే యున్నట్లు స్ఫూర్తినిచ్చుచున్నదా ? యని.

ఈ విషయవివేకము శ్రీదక్షిణామూర్తి స్తోత్రమునందలి ఈక్రింది శ్లోకమున చెప్పబడియున్నది.

శ్లో॥ విశ్వం దర్పణదృశ్యమాన నగరీతుల్యం
నిజాంతర్గతం । పశ్యన్నాత్మనిమాయయా
బహిరివోద్భూతం యథా నిద్రయా
యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మా

నమేవా ద్వయం । తస్మై శ్రీ గురుమూర్తయే
నమయిదం శ్రీ దక్షిణామూర్తయే ॥

భావము : ఒక బీజమునందు అంకురము. మొక్క, చెట్టు, పత్ర పుష్పములు కారణరూపమున నున్నట్లు ఈ శ్లోకమున జీవేశ్వర జగత్తులను అధ్యారోపత్రయము. సర్వాధిష్ఠానమగు పరమాత్మయందు అంతర్గతములేనని చెప్పబడినది. కనుక జాగ్రదవస్థయందు ఏవీ రూపములతో భాసించినను ఆ నామరూపములకు స్వాతంత్రసత్త లేదు. కానీ, మాయాశక్తి ప్రభావము వలన ఆత్మకు బాహ్యాదేశమందున్నట్లు స్ఫురించినను, అవి యన్నియు ఆత్మాంతర్గతములేగాని అన్యములు గావు. కనుక ఏకైక స్వరూపుడు సర్వాత్మ. ఆతనికి అన్యమగునది మరొకటి అసంభావ్యము అనుటయే ఆత్మతత్త్వ వివేకమునకు తాత్పర్యము. దర్పణమందు దృశ్యమానమగు వస్తువుల ఉనికిని దెలుపుటయేగాక మరొక ఉపమానముకూడా చెప్పబడినది. ఏమన—

కల గనువాడు తాను సంచరించుచున్న స్వప్నజగత్తంతయు తనకు బాహ్యమునందున్నట్లే తెలిసికొనుచున్నాడు. ఐనను తాను మెట్టి విహరించు చున్న దేశములు అచటికిపోవ తానెక్కిన విమానములు, అతని మస్తిష్క మగు అద్దమునందే అంతర్గతమై యున్నవిగదా ! ఇప్పు డాతనికి ఏదో శబ్దమువలననో, స్పర్శచేతనో ప్రబోధము కలిగి మెలకువ వచ్చినయెడల మరల తన ఇంద్రియములకు ఇంద్రియార్థములతో సంయోగము కలుగగా అతడు మరల జాగ్రత్ప్రపంచమునకు రాగా స్వప్నప్రపంచమునందలి మేడలు మిద్దెలు, రైళ్ళు విమానములు, ఆప్తులు బంధువులు సర్వమూ అదృ

శ్యముతై లేనివిగనే తెలియబడినందున అది మిథ్యాప్రపంచ మనుచున్నారు. జాగ్రత్ప్రపంచమున్ను మనకు దృశ్యమానమగుచు, ఉన్నట్టిదియేనను విశ్వాసము కుదిరినను అదియును మిథ్యయని చెప్పుటకే ఈ స్వప్నప్రపంచ దృష్టాంతము చెప్పబడినది.

స్వప్నావస్థయం దాత్ముడు సూక్ష్మశరీరాధిష్ఠితు డగును. అది తైజస పదార్థ నిర్మితమై యున్నందున ఆతడు తైజసు డనబడుచున్నాడు. పదార్థము రాశిరూపమున లేకున్నను లేనిదైన ఘనపదార్థముతో నిర్మితమైన మేడలు మిద్దెలు దృశ్యమానమగును. ఇదియే వివర్తవాదమునకు ప్రాతిపదిక, అనగా లేని ఘనపదార్థము ఉన్నట్లే స్ఫూర్తినిచ్చుట. ఈ విషయమును బోధించుటకే స్వప్నావస్థకు తత్త్వశాస్త్రమున ప్రముఖస్థానముపలభ్యమైనది.

తాత్పర్యము : ఆత్మజ్ఞానము ప్రాప్తించిన పిమ్మట, జాగ్రత్ప్రపంచమున్ను స్వప్నప్రపంచమువలె లేనిదగుట యని నిరూపించుటయే.

3. 'యచ్చాప్తి విషయానిహ' ఇంద్రియార్థముల ననుభవించుచు భౌతికశరీరము నభిమానించుతరి జాగ్రదవస్థయందలి ఆత్ముడు విశ్వు డనబడుచున్నాడు. ఈతడు ఇంద్రియముల ద్వారమున మనస్సుచే ప్రమను పొందును. అనగా విషయజ్ఞానమును పొందుచున్నందువలన ప్రమాతయని వ్యవహరింపబడుచున్నాడు.

## అనుస్యూతో భవతి ఇతి ఆత్మ :

స్థూల సూక్ష్మకారణ శరీరములను అనుస్యూతముగ— అనగా, ఒకదాని తరువాత మరొకదానిని అధిష్ఠించి అభిమానించుటచే ఆత్మునికి విశ్వ, తైజస, ప్రాజ్ఞులను పేర్లు ప్రాప్తించినను ఈ మూడవస్థలయందును

సర్వదా అనుస్యూతముగ నుండునది ఆత్మయేనని తెలిసికొనుటయే ఇందలి గ్రాహ్యాంశము. మరియు ఒక అవస్థను పరిగణించునపుడు మిగత రెండవస్థలును మిథ్యగా పరిగణింపవలసివచ్చును. కనుక ఈ మూడవస్థలయందును తన ఉనికిని సుస్పష్టముజేయుచు సాక్షిమాత్రుడుగనుండు నిత్యసత్యపదార్థము ఆత్మయేననుట మరొక ప్రయోజనము. వ్యష్టివిషయమున విశ్వ, తైజస, ప్రాజ్ఞులుగ తెలియబడు ఆత్మ సమష్టియందు విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతులని వ్యవహరింపబడుచున్నారు. ఈ అవస్థాత్రయమునందలి "నేను" అని చెప్పబడుచున్నవాడే ప్రత్యగాత్మ లేక కూటస్థఆత్ముడు. 'ఆత్మానం విజానీయాత్' అను ఆదేశానుసారము- పరమాత్మయందలి స్వరూపధర్మములను, ఎరుకను (consciousness) సంతరించుకొన యత్నించువానికి ప్రత్యగాత్మ, పరమాత్మ, పరబ్రహ్మ అను స్థితుల అనుభూతి అతిశీఘ్రముగ సిద్ధి ప్రాప్తించునని తాత్పర్యము.

ఈ జగత్తు సృష్టియగుటకు ఒక కారణమునేది ఉండవలెగదా యను భావము ప్రతి సామాన్య మానవునకు కలుగుతునే యుంటుంది. అంటే కార్యరూపమైన జగత్తుకు కారణరూపం మరొకటి ఉండవలె ననుటతో కార్య కారణములు రెంటిని అంగీకరించటమైనది. ఇలా అంగీకరించటంలో కారణమగు ఈశ్వరునకు, కార్యమగు జగత్తు భిన్నము గాదను తాత్పర్యము ఇభిాచుచున్నది. ఇదే అద్వైతమునందలి ఒక మూలసూత్రము. దీనినే అనన్యత్వభావ మంటారు. **The doctrine of total identity or at one-ment** అంటారు. ఈ భావమును విశ్లేషించి విచారించితే కారణావస్థ సూక్ష్మస్థితి గనుక అవ్యక్తముగ నుంటుంది. కార్యావస్థ స్థూలము గనుక వ్యక్తమై భిన్నరూపములతో సువ్యక్తమగుతుంది. కనుక మార్పునబడేది

స్థూల సూక్ష్మదశలకు సంబంధించినదియేగాని అసలు వస్తుతత్త్వమునందు గాదు. కనుక జగత్తు ఒక కార్యమని గ్రహించినయెడల దాని కారణావస్థ యందు అది జ్ఞానస్వరూపమని బోధపడుతుంది.

ఇక వీటి సత్తను (ఉనికి existence) గురించి విచారించిన ఈకార్య కారణములు రెండును అప్రవిభాజ్యములని చెబుతుంది శాస్త్రము. ఏమంటే కారణమున్నమేరకే కార్యముంటుంది; మరియు కారణమనేది ఉన్నంతకాలమే కార్యమునకు ఉనికి యుంటుంది. కనుక కార్యముల ఉనికినిబట్టియే దేశ కాలాలు ఏర్పడుతవని మనము గ్రహించవలయును మరియు కారణసత్తయే కార్యసత్తగ భాసమాన మగుననియు తెలియవలయును. కానీ ఒకప్పుడు కార్యరూపము మూర్తిమంతముగ లేనప్పుడుకూడ ఉన్నట్లే గోచరించును. అట్టి దృశ్యమాన వస్తురూపమును ఆభాస యందురు.

"కారణగుణాః కార్య మనుప్రవిశంతి"

కారణమే మరొక రూపంలో భాసించుచుండగా దానినిచూచి అది కార్యమని భావించుచున్నావు.

N. B. :- తాత్త్వికదృష్టితో కారణస్వరూపాన్ని విశ్లేషించి తెలిసు కొని అట్టి కార్యమునందు ఆ కారణమును గుర్తించి తెలుసుకొనుటే ప్రత్యభిజ్ఞ అంటారు.

సాంఖ్యమన జ్ఞానబోధ యనియే పండితులు ప్రవచింతురు. కానీ, జగన్నిర్మాణము 25 తత్త్వములచే జరుగుచున్నదని సాంఖ్యులు వేరే తత్త్వములతో జరుగుచున్నదని శాక్తేయులును తెలుపుచున్నారు. నిర్మాణాత్మక తత్త్వములసంఖ్యను దెలుపుచున్నదిగనుక ఈ శాస్త్రమున్నూ సాంఖ్యమనియే

వ్యవహారమునందున్నది. దీనికి కపిల సాంఖ్యమని ప్రసిద్ధనామము. దీనిని గీతయందు భగవాను డిట్లు నిర్వచించి యున్నాడు.

శ్లో॥ భూమి రాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధి రేవచ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా. (7-4)

అని పృథివ్యాది పంచభూత తన్మాత్రలు మనస్సు, దానికి కారణమగు అహంకారము, అహంకారమునకు కారణమగు మహత్తున్ను కలిపి ఇవి ఎనిమిది విధములగు నా ప్రకృతులని ఏడవ అధ్యాయమున భగవానుడే చెప్పియున్నందున దీని విచారణ ఆవశ్యకమని ఇది తెలియనివారికి నిత్యానిత్యవస్తువివేకము ప్రాప్తించదనియు గ్రహింపవలసి యున్నది.

ఇది తెలిసిన పిమ్మటనే—

శ్లో॥ జ్ఞానం తేఽహం స విజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః ।
యత్ జ్ఞాత్వానేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవ శిష్యతే ॥ (7-2)

భావము : ఏ జ్ఞానము తెలిసికొనిన పిదప ఈ లోకమునందు తెలియదగిన ఇంకొక విషయముండదో అట్టి స్వానుభవముతో గూడిన విజ్ఞానమును నీ కొరకు చెప్పుచున్నాను. అని భగవానుడు చెప్పెను.

This is why I, for my self, am both a materialist gnd a spiritualist as well, in the integral sense.

## 2. ప్రత్యభిజ్ఞా సిద్ధాంతము : పరిచయము

"ప్రతి అభిముఖ్యేన జ్ఞానం" అని ప్రత్యభిజ్ఞయే శబ్దార్థము మన ముందు ఉన్న వస్తువును చూచి ఓహో ! అప్పుడు చూచిన ఆ వస్తువే మనకు

యిప్పుడు తెలియబడుచున్న ఈవస్తువు అను ప్రతిసంధానరూపమగు జ్ఞానమే ప్రత్యభిజ్ఞ. కారణరూపమును కార్యమునందు దర్శించుటే ప్రత్యభిజ్ఞ. అనగా అధిష్ఠాన పదార్థమును అన్యములందు గుర్తించుటయే.

తెలిసికొనుటయన— చూడబడుచున్న వస్తువుతో చూచే దృశ్శక్తి తాదాత్మ్యము పొందుట. దీనిని ఆంగ్లమున రికాగ్నిషన్ (recognition) అందురు. చూడబడిన పదార్థము చూచినవాని స్మృతిపథమునుండి మరుగై పోగా- దానినే మరొకదేశమున మరొకకాలమున చూచుట సంభవించితే, ఓహో! ఇదే అప్పుడు అక్కడ చూడబడిన పదార్థము అని గుర్తుజేసికొని, మరల ఎరుకపొందుట మరల ఆ అనుభూతిని పొందుటయే ప్రత్యభిజ్ఞ. "ఇది-అదే" అను అనుభూతి పొందుటయే ప్రత్యభిజ్ఞ. ఆంగ్లమున re-cognition అంటే మరల అనుభూతి పొందుట అని భావము.

ఇంతవరకును ఆ పదభావమును స్థూలముగ గ్రహించితిమి. ఇక ఈ దర్శనశాస్త్రమునకు మూలమును తెలిసికొందము.

కాశ్మీరదేశమున వసుగుప్తుడను పండితునిచే ప్రత్యభిజ్ఞ ఒక దర్శనముగ రూపొంది ప్రసక్తమయ్యెను. అది A.D. 8వ శతాబ్దము. ఆతడు దీనిని కల్లటునకు బోధించెను. వీరు శివసూత్రములను, స్పందసూత్రములను కూడ రచించి యుండిరి. అందుచే ఈ సిద్ధాంతమున ద్వైవిధ్యము ప్రాప్తించెను. సోమానందుడు ఆతని శిష్యుడగు ఉత్పలుడును ప్రత్యభిజ్ఞాసూత్రముల వ్రాసియుండ— వసుగుప్తుడను మరొక శిష్యుడు స్పందసూత్రముల వ్రాసి ప్రచారము జేసిరి. ప్రత్యభిజ్ఞయందు దృశ్యమును శివుడుగనే గుర్తించి, ఆ గుర్తింపును అలానే అనుస్యూతముగ అనుభూతి పొందుటయే ఇందలి

ప్రక్రియ. మన నిత్యజీవితము నందిది యొక సాధన గావలయును. ఇందు వల్ల శివుడు కానివగునవొకటియుంటే— దానిని మిథ్యగనే పరిగణించుటయే ప్రధాన విషయము.

ప్రత్యభిజ్ఞాప్రవాచకులు విశ్వమును విశ్లేషించి 36 తత్త్వములతో కూడియున్నదని అంగీకరించిరి. దీనికి దృశ్శక్తితోగల తాదాత్మ్యభావమే ప్రత్యభిజ్ఞకు ఫలమని అందురు. **The fusion of the subject (Druk) and the odject (Drusyam) produces recognition or Pratyabhigna.** ఈ దర్శనము శాక్త శైవ ఆగమములనుండి రూపొందింపబడినట్లు తెలియుచున్నది. శక్తికి ప్రాధాన్యము కల్పించి శ్రీ శంకరులు సౌందర్యలహరిని రచింప ఆయన గురువగు గౌడపాదులు 'సుభగోదయము'ను రచించియుండిరి. జ్ఞానవైరాగ్యములను దివ్యగుణముల ప్రసాదించునది గనుక ఈ శక్తిరూపిణిని "సుభగ"యని పరిభాషించుచున్నారు. ఈమె జగదుత్పాదనకు కారణమగు బ్రహ్మశక్తియే; బ్రహ్మచైతన్యమునకు సహజ స్వభావ ధర్మమైన దీశక్తియే. త్రిపురసుందరికి అధిష్ఠాన మీ సుభగసుందరియే.

ఇపుడు మనకు స్ఫురించున దేమి? గురుశిష్యులగు గౌడపాదులు శంకరుడును శ్రీవిద్యోపాసకులనియేగదా! ఐనను వీరిని శాక్తేయులుగ పరిగణించరాదు. ఏమన—

శివుని పరమలక్ష్యముగ నిర్ణయించుకొని శక్తి ఉపాసనను తమ లక్ష్యసిద్ధికి సాధనముగ సంభావించుకొని చేయబడుచున్నదని చెప్పుటచేతనే. శాక్తేయమును రెండవస్థాయికి దించుటయే. అద్వైతులకు ఇది విశేషముగ నుపకరించును. తమ లక్ష్యసిద్ధికి సాధనమగు ఇట్టి మహత్తర పరమేశ్వరీ శక్తిని జడమనుట విచారించదగిన మరొక విశేషము.

త్రియంబక శైవులు (కాశ్మీరశైవులలో ప్రత్యభిజ్ఞాసిద్ధాంతానుయాయులు) మొదటితత్త్వము పరతత్త్వశివుడేగానీ, అద్వైతుల పరబ్రహ్మము కాదందురు.

వేదాంతులు (అద్వైత సిద్ధాంతానుయాయులు) పరబ్రహ్మ. శివుడుగాడు, విష్ణువుగాడు, అది ఒక నిరుపాధిక ఆకాశతుల్య సమగ్ర ప్రజ్ఞానము మాత్రమే నందురు. A disembodied either like unity consciousness కనుక అద్వైతమునకు శాక్తేయమునకును లక్ష్యమందు మాత్రమే భావభేదముగాని సాధనయందుమాత్రము గాదు.

శక్తి శివుని ఆశ్రయించి యున్నందున పరమస్థాయిదగు పరమార్థ తత్త్వము శివుడే నందురుగాని శివశక్తులకుగల అవినాభావ సహజసంబంధమును గుర్తించి మన్నించకుండుటయే ఇందుకు కారణము. కేవల పరబ్రహ్మ తత్త్వమునందైనను ఆతనిదగు ఆ సహజశక్తి పరివ్యాప్తమైయుండునుగాని నశించదుగదా! కనుక ఈ శైవశాక్తేయులకు భేదభావమును నేను గుర్తింపనేరకున్నాను. Siva is the Principle of being and Sakti is the principle of becoming in the Saguna state అని గ్రహించినవారికి మాత్రము అద్వైతము సిద్ధించగలదు.

ముందటి అధ్యాయములో అవస్థాత్రయ విజ్ఞానమును పొందితిమి. దీనికి తురీయమను మరొక ఉత్కృష్టావస్థనుకూడ కలుపుకున్నయెడల అవస్థలు నాలుగగును. ఇది నిర్వికల్పసమాధిస్థితి యందనుభూతియగు అవస్థ. ఈ నాలుగవస్థలయందును అనుస్యూతముగ నుండువాడు దేహియే యని గ్రహించితిమి. ఈ దేహికి "నేను" అను అనుభూతి ప్రత్యభిజ్ఞవలననే కలుగుచున్నది. ఈ అనుభూతి ఆత్మతత్త్వమును నిరూపించును.

దేహికి బాల్యము, యౌవనము, కౌమారము, వార్థక్యము అను నాలుగు అవస్థలు ఆరోపింపబడుచున్నవి. సూక్ష్మముగ విచారించినయెడల ఇవి దేహమునకేగాని దేహికి సంభవింపవు. ఎట్లన— దేహమునందలి కోట్లాదిగయున్న జీవకణములలో ప్రతిక్షణమును, లక్షల సంఖ్యలో చచ్చి విసర్జింపబడుట అట్లే లక్షల సంఖ్యలో క్రొత్త జీవకణములు పుట్టి వాటి స్థానమునందుండి దేహమును ధరించియుండుట జరుగుచున్నది. ఈ విధానముతో బాలుడు యవ్వనుడగుట మరల నిట్టి మార్పులవలననే కౌమారమునుండి యవ్వనస్థితిని అటుపిమ్మట వార్ధక్యస్థితిని పొందుట మన అనుభవమునందలి విషయము. ఈ దశలయందు క్రమశః నిర్మాణశక్తి క్షీణించుటవల్ల అశక్తత ప్రబలి ఈ అవస్థలను స్ఫుటముగ సంభవించును.

ఈ దశలన్నియు స్థూలశరీరమునకేగాని దేహియగు ఆత్మకు ప్రాప్తించవు. అస్తి, జాయతే, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే నశ్యతి యను షడ్భావవికారములు ఆత్మస్వరూపమునందు లేకున్నను ఆరోపితములైనందున వీనిని తటస్థలక్షణము లందురు. ఈ అవస్థల పరిశీలించుటకు— వృద్ధాప్యము వచ్చినవ్యక్తి పలుకులు వినిన— "నా బాల్యములో ఆటలయందు మేటిని, పాటలలో ప్రతిభావంతుడను, యవ్వనదశలో వ్యవహారములయందు సుప్రసిద్ధుడను, గౌరవమర్యాదలు పొందియున్నాను. కౌమారదశలో విజ్ఞాన వికాసముతో ఇతరులకు మార్గదర్శకుడనై దక్షత ప్రదర్శించితిని. అట్టి నేను ఈనాడు కదల మెదలలేక ఒకచోట కూర్చొనియున్నాను అని దక్షుడనుస్థితిని అశక్తుడైనస్థితిని తెలుసుకున్నందున ఆనాటి దక్షుడగు ఆ నేనే ఈనాటి ఈ నేను అనుభవము అజ్ఞులకు స్థూలశరీర సంబంధిగ తోచినను విజ్ఞులకు గురు వేదాన్తవాక్యశ్రవణ మననములచే ప్రత్యభిజ్ఞ గలిగి దేహియే అప్పటి

నేను, ఆ దేహియే ఇప్పటి నేను అను జ్ఞానము ప్రాప్తించుటచే తాను అనిత్య సత్య పదార్థము నేనను అనుభూతి పొందును. ఇది పారమార్థకదృష్టికి జీవాత్మయే పరమాత్మయని ప్రత్యభిజ్ఞచే గ్రహించును.

ప్రత్యభిజ్ఞాదర్శనము అవైదికముగ పరిగణింపబడుచున్నది. "శివాద్వైతము" అనుపేర ఇది కాశ్మీరమునందు సుప్రష్టితమై యున్నది ఆగమములను సంస్కరించి ఉపనిషత్సిద్ధాంతముల కనుగుణ్యముగ ఈ దర్శనము రూపొందింపబడినది. సోమానందనాధుని "శివదృష్టి" ఈ దర్శనమునకు మూలగ్రంథము ఆతని శిష్యుడగు అభినవగుప్తుడు ఈశ్వర ప్రత్యభిజ్ఞా సూత్రములపై "విమర్శన" అను వ్యాఖ్యానము వ్రాసెను. 'ఈశ్వరోఽహం' (ఈశ్వరుడను నేనే) అను అభిజ్ఞయే దీనికి పరమార్థఫలము.

సారతత్త్వము : ఆ నేను - ఈ నేను ఇరువురు అనన్య ఏకైక తత్త్వమునకు చెందినవారనియు ఆ తత్త్వము ప్రత్యగాత్మయనియు అవిద్య తొలగినంతనే ఇది పరమాత్మయేనను నిశ్చితాభిప్రాయము అనుభూతి లభించుననియు ఆరూఢము జేసికొని—— ఆత్మతత్త్వమును ప్రత్యభిజ్ఞా ప్రక్రియచే అనుమేయము ననుభూతికి దెచ్చుకొనగలము. పరిపూర్ణదివ్యతత్త్వము మన ఆత్మయందభిముఖుడై స్ఫురింపగా కలుగు ప్రతీతియే ప్రత్యభిజ్ఞ. ఇదియే కాశ్మీరమందు శివాద్వైత మనబడుచున్నది. శంకరుడుజెప్పిన పరబ్రహ్మతత్త్వమునుగూడ శివుడనియే వీరు ప్రవచింతురు. నేనే ఈశ్వరుడను అను సాక్షాత్కారమే ప్రత్యభిజ్ఞ. ఇందుకు జ్ఞప్తియందుంచుకొనవలసిన సూత్రములు :

1. కార్యకారణాలు రెంటిలో కారణానికి భిన్నంగా దాని కార్యముండబోదని అద్వైత సిద్ధాంతము.

2. కారణసత్తా ఏదో దాని కార్యానికికూడా సత్తా అదియే.

# మాయావాద వైభవము

ఇది విభవ. పై శీర్షిక నా మస్తిష్కమున మెరసిన దీ విభవనామ సంవత్సరమునందే. నా జన్మసంవత్సరమగు శోభకృతు సార్థకమై శోభిల్ల నా పుట్టిన తిథి పూర్ణిమ కౌముదీకాంతిన నీ మాయావాదము మాన్యముగ స్ఫురించినది. అద్వైత సిద్ధాంతము నవగాహన జేసికొన నిదియొక వెలుగు బాటయైనది.

ఆత్మతత్త్వ పరిశీలనకుగాను మనము మూడు అంశములను ప్రాతిపదికలుగ నెన్నుకొంటిమి. అందు అవస్థాత్రయమును, ప్రత్యభిజ్ఞా సిద్ధాంతమును పరిశీలించి ప్రత్యగాత్మ స్వరూపవిషయమును కొంతమేరకు సముపార్జించితిమి. పరిశీలనకు ఇక మూడవఅంశము 'మాయ'. ఇది నా రభిమాన పాత్రమగు పదము. ఏమందురా? "మాయాంతు ప్రకృతిం విద్ధి - మాయినంతు మహేశ్వరం" అనిగదా సూక్తి! మాయను జయించి మహేశ్వరుడను గావలెననిగదా నా ఆకాంక్ష !! మరియు ఇదియొక పదమూమాత్రమేగాదు—ఒక తత్త్వమే యని ప్రస్ఫుటించుటకు ఆధారములును స్ఫురించుచున్నవి.

మాయ నొక తత్త్వముగ వేదాన్తు లంగీకరింపరు. ఏమందురా? వేదాన్తులకు లక్ష్యమగు పరబ్రహ్మతత్త్వమునందు ఆ మాయయు లేదు, మాయాశబలితుడగు దేవుడూలేడు. అంటే మాయలేనియపుడు దేవుడూ యుండడని భావము. ఈ రెంటికినీ అన్యోన్యాశ్రభావ సంబంధ మున్నదన్నమాట. మరి దేవుడిని ఒక తత్త్వముగ మన్నించునంతమేరకు మాయను ఒక తత్త్వముగ మన్నింప నుపపత్తి లభించుచున్నదిగాదా! అస్తు !!

ఈ మాయ, శాస్త్రములయందొకప్పుడు హేయముగ చిత్రింపబడుచున్నది, మరొకప్పుడు ఉపాదేయముగను బోధింపబడుచున్నది. ఎట్లన—

"శివశ్శక్త్యాయుక్తోయది భవతి ప్రభవితుం" అను శ్లోకభావమునుబట్టి ఇది శక్తిరూపమగు తత్త్వమనియు, క్రియాశీలియు, నని తెలియవచ్చుచున్నది. ఇది శుద్ధసత్త్వప్రధానమగు అంశ. ఇది మాయయొక్క దివ్యాంశయనియు జ్ఞానపూర్వకమనియు కనుక ఉపాదేయమనియు గ్రహింపనగును. ఇది శుద్ధమాయ.

మాయకు మరొక అంశ త్రిగుణాత్మికయగు మలినమాయ. ఇది ఆవరణ విక్షేపశక్తుల కాధారమగు రజస్తమస్సులను పదార్థముల నాశ్రయించి యుండును.

ఒక సూక్ష్మ వివరణ : ఏ గుణమునకైననూ ఏ శక్తికైనను పదార్థము ఆశ్రయమై యుండవలెను ఇది వైశేషిక దర్శన సిద్ధాంతము. అట్లే ఆవరణ విక్షేపాదిశక్తులకుగాని రాగద్వేషాది వికార ధర్మములకు (లక్షణములు) గాని సత్త్వరజస్తమస్సులే ఆధారము. కనుక నీ సత్త్వరజస్తమస్సు లనబడునవి పదార్థ చరమరూప లేశములే. విజ్ఞులు వివేచింతురుగాక! వీటి సామ్యావస్థయె అవ్యక్తస్థితియు వైషమ్యమే వ్యక్తరూప భౌతిక సృష్టియు అగుచున్నది.

కనుకనే దేహాత్మ భావకారకము, జీవధర్మజనకమునై యున్నది. పుణ్యపాపకార్యాచరణల జేయించి పుట్టుట చచ్చుట అనగా జీవుడు వచ్చుట పోవుట, పూర్వకమగు సంసారమునకు కారణమగుచున్నది. అందుచే ఇది మాయయొక్క హేయాంశ. దీనిని తొలగించుటకు చేయవలసిన సాధనయే భగవద్గీతయందలి మౌలికమగు బోధ.

ఈబోధ ప్రక్క మూడు శ్లోకములయందిమిడి యున్నది.

1. "త్రైగుణ్య విషయావేదానిస్త్రైగుణ్యోభవార్జునా (గీ. 2-45)

వేదములు (బ్రాహ్మణ భాగములు) సంసార హేతువులగు కర్మలను బోధించునవి గనుక నీవు నిస్త్రైగుణ్యుడవు గమ్ము అను విధివాక్యముచే ఆదేశపూర్వక మగుచున్నది. ఈ ఆదేశముతో గీత నిష్కామబోధతో ఉపక్రమింపబడినది.

2. "గుణానేతానతీత్య త్రీన్ దేహీదేహ సముద్భవాన్" (గీ. 14-20)

దేహోత్పత్తికి కారణభూతములగు సత్త్వరజస్తమస్సుల పూర్వక మగు గుణత్రయమును యీ జీవితమునందే అతిక్రమించవలెనను బోధతో విస్తరింపబడినది.

3. "సర్వ (జీవ) ధర్మాన్ పరిత్యజ" (గీ. 18-66)

అను ఆదేశముతో ఉపసంహరింపబడినది. జీవధర్మములన, దేహాత్మభావము కర్తృత్వ భోక్తృత్వ అహంకార మమకారాదులు.

నా దృష్టిలో- ఇదియే గీతయందలి తత్త్వసారము. మరియు ఈ సృష్టికి మూలపదార్థములుగ

శ్లో॥ భూమిరాపోఽనిలోవాయుః ఖం మనోబుద్ధి రేవచ।
అహంకార ఇతియం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥ (గీ. 7-4)

మరియు —

శ్లో॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమే పరామ్
జీవభూతాం మహాబాహో! య యేదంధార్యతే జగత్ ॥ (గీ. 7-5)

అని మాయాశక్తికి ఎనిమిది ప్రకృతులను అంగములుగ గీత బోధించినది. దీనినే జడమనియు అపరాప్రకృతి యనియు అందురు. ఇదిగాక

జీవభూతమైన మరొక శ్రేష్టమగునది పరాప్రకృతి యనియు చెప్పబడెను. ఇట్లు పరాఽపర, జీవజడపూర్వకమై, స్థూల సూక్ష్మ పదార్థరూపముల తెలియబడునది ఒక తత్త్వముగాక మరేమనదగును ?

ఇతర దర్శనములకూడ నవలోకించి పరిశీలింతము :—

i. కపిలసాంఖ్యము : ఇందు ఇరువదినాల్గు తత్త్వముల విశ్లేషించి తెలిపి, పురుషతత్త్వ మనుదానినికూడచేర్చి, సేశ్వరసాంఖ్యమని మాయాతత్త్వ స్వరూపమును స్పష్టీకరించి బోధించిరి. ఇందు ముందు తన్మాత్రలగువాటితో భూతసృష్టియు, ఈ తన్మాత్రలను పంచీకరించి మరల వీటి భిన్నఅంశల సంకలనముతో భౌతికసృష్టియు విశదీకరించి పేర్కొనబడినవి. ఈ భూత భౌతికసృష్టి కంతటికిని "ప్రధానము" అను పేరుతో చెప్పబడునది మాయయే·

ii. శక్తినే ప్రధానముగ పరిగణించు శాక్తేయులు సాంఖ్యులు చెప్పిన ఇరువది అయిదు తత్త్వములకు మరికొన్నిటిని కలిపి ముప్పది ఆరు (36) తత్త్వములతో ఈ జగత్తు రూపొందినదని జగత్తుకు మూలమగు పదార్థములను పేర్కొనిరి. పరమార్థదృష్టిచే శక్తియే ప్రజ్ఞకుగాని ప్రవృత్తికి గాని మూలకారణ మనిరి.

పై జూపిన ప్రధానదర్శన బోధల పరిశీలింప నా అల్పవిజ్ఞానము వికసించి— మాయ యొక సాపేక్షికతత్త్వముగనే భాసించుచున్నది. (A relative principle) అస్తు !

"మాయ" యను నీ పదముయొక్క ప్రయోగమును ప్రయోజన మును అవగాహనతో గ్రహించుటకు రెండు భావములను జ్ఞప్తియందుంచు కొనుటావశ్యకము. ఏమన—

1. The Principle of being (the thing n itself) ఇది సర్వమున కును కారణతత్త్వము, కనుక అధిష్ఠానము లేక ఆధారము

2. The Principle of becoming పరిణమించి ఆవిష్కరణపొందు పదార్థము(మలినమాయ): సత్త్వరజస్తమస్సుల పూర్వకమైనది.This principle is Maya in respect of its producing multiple appearances of one and rhe same object. It is called Avidya in respect of its obscuration of the knowledge of the Real I believe that the two are different when the sense is considered, but these are generally used the one for the other without difference or distinction even by some Pundits. Maya in its real sense is Sakti or power of Iswara inhering in him; where as Avidya or Agnanam inheres in Jeeva and veils him only to dim both his divine spark and the intellectual faculties. This being the main point of difference Maya and Avidya should be used appropriately.

బ్రహ్మయే పరిచ్ఛేదమును పొంది (individuation) నానాత్వముతో ప్రకాశించుట వ్యక్తిగతముగ వ్యవహరింపబడుటయు ఈ మాయాప్రభావము వల్లనే. తమస్సు రజస్సులు రెండును, నీ సహజ ఆలోచనాసరళి కడ్డుతగిలి, చైతన్యస్వరూపమును మరుగుపరచి అన్యవస్తురూపమున గోచరింపజేయుటచే (distortion) అవిద్యాకారకము లగుచున్నవి. కనుక అవిద్యయే అజ్ఞాన కారకము.

అవిద్యకు లక్షణమే అధ్యాస. "స్మృతిరూపః పరత్ర పూర్వదృష్టావభాసః అవిద్య" అని నిర్వచనము. ఇదివరకు చూడబడినది ఇపుడు చూడ

బడుచున్న వేరొకదానియందు స్మృతిపూర్వకముగ భాసించుటయే అధ్యాస. దీనియందు భౌతికమగు రాశి (the physical mass) యుండదు. "స్మృతి జ్ఞానమే" ప్రాతిభాసిక పదార్థమునందలి రాశిగ ప్రవృత్తి పొందును. శాంకరాద్వైత సిద్ధాంతమున నీ అధ్యాసకు ప్రముఖస్థానము గలదు. ఏమన- అధ్యాస కలుగనిదే అధ్యారోపమున కనువగు భావరూపముల స్ఫూర్తి ప్రాప్తించదు. అధ్యారోపమన— ఒక వస్తువుయొక్క సహజ స్వరూపమును చూచుచునే, దానిని మరొక వస్తువుగ భ్రాంతివలన భావించుట. ఉదా॥ ఒక తాడును తన రెండు కళ్ళతో చూచుచునే తాడని అనుకొనక, దానియందే పామునుగాదు, పాము ఆకారమును దర్శించి, ఆ కన్పించు ఆకారము పామేనని విశ్వసించుట. అధిష్ఠానమగు ఆత్మయందును ఇట్టి బూటకపు స్మృతి జ్ఞానరూపముల సంభావించి విశ్వసించుటయే అధ్యారోపము. అంతియె గాని ఒక తాడుపైన ఒక నిజమగు పామును పరుండబెట్టుట గాదు అధ్యారోపమునకు పదార్థము (mass) స్మృతిజ్ఞానమే. స్వప్నావస్థ యందును ఇదియే ప్రధానము.

## మాయాస్వరూప జ్ఞానప్రాప్తికి ప్రయోజనములు

1. జీవేశ్వర జగత్తులను ప్రధాన తత్త్వములు మూటియందున సత్యవస్తువేది, మిథ్యారూపము లెవ్వి యని నిర్ధారించుట కుపకరించు ఒరిపిడి రాయి యీ మాయ.

2. విపర్తదృష్టి యన నెట్టిదో అందలి ప్రక్రియ ఎట్టిదో వివరింప నుపకరించు తత్త్వమీ మాయ. ఇది రెండు అంశలతో తెలియబడుచున్నది. (i) శుద్ధసత్త్వగుణ ప్రకాశకమగు అంశ. ఇది ప్రకృతి సంబంధియే అగుట

వలన కారణోపాధిగ నుపకరించు అంశ. ఇది లేనియెడల ఈశానుడగు మన దేవునకు (our extra cosmic personal God) ఉనికి ప్రాప్తించి యుండెడిదే గాదు; సృష్టియు జరిగియుండెడిదే గాదు. (ii) రెండవ అంశ అవిద్య. సత్యవస్తు స్వరూపజ్ఞానము లేకుండుచే అవిద్య. ఇది రజస్తమ స్సుల కలయికచే మలినమైన ప్రకృతియే. ఇది మలినమాయ యని వ్యవహ రింపబడు తత్త్వము. దీనినే అజ్ఞానమనియు వ్యవహరింతురు. కనుక నిది సత్యవస్తు జ్ఞానపు అభావమే అజ్ఞానమని సూచించుచున్నది. కాని, నాకు స్ఫురించిన నిర్వచనమును దయతో పరిశీలించండి స్థూలముగ జెప్పు చున్నాను. రజస్తమస్సు లనబడు పదార్థముల నాశ్రయించి ఆధారము పొందియుండు ఆవరణ విక్షేపములను శక్తుల ప్రభావము, మానవుని అంతఃకరణమున ప్రసరించి దానిపై ప్రగాఢమగు ఒత్తిడి కలిగింప (Impact) దానివలన ప్రాప్తించు ప్రజ్ఞానాశము, భ్రాంతిజ్ఞానముల సమి ష్టియే "అజ్ఞానము" అని నా నిర్వచనము.

శుద్ధసత్త్వప్రధానమగు మాయయందు ప్రతిబింబించిన చైతన్యమే ఈశానుడు లేక ఈశ్వరుడు. అంటే సర్వభూత నియామకుడును పాలకు డును అగు తత్త్వము లేక దేవుడు. మలినమాయయందు ప్రతిఫలించిన (అవిద్యావచ్ఛిన్నులగు) కూటస్థ చైతన్యపు బింబములే జీవులుగ సృష్టికి పునాదు లగుచున్నారు.

"మాయ" అనునది క్రియాశీలియగు నొక తత్త్వమె— కానియెడల అనగా దానికి ఎవ్విధమగు ఉనికియు లేనియెడల :

1. చైతన్యతత్త్వమునందు స్థాయీభేదములగు పరబ్రహ్మ పరమేశ్వర ఈశ్వర జీవస్థాయిలుగాని వివర్తప్రక్రియలుగాని పరిగణనకు వచ్చియుండె డివి గావు

2. జీవేశ్వరజగత్తులని చెప్పబడు మూలతత్త్వములు సత్యములా మిథ్యామాత్రములా యను విచారణకు అవకాశముండేది గాదు.

3. బ్రహ్మతత్త్వము సగుణమా నిర్గుణమా? ఏకైకతత్త్వమా — జీవజగద్విశిష్టమా? జీవేశ్వర జగత్తులకు స్వాతంత్ర్య ప్రతిపత్తి గలదా? యను చర్చలకు ఆత్మతత్త్వపు కైవల్యస్థాయి నిర్ధారణకును అవకాశ ముండెడిది గాదు.

ఆఖరుమాట : ప్రతిభాస యనగా— వ్యావహారికమున సత్యమగు ఉనికిగల వస్తువొకటి లేకున్నను— సంభావింపబడినట్టి వస్తువొకటి స్ఫూర్తి వలన దృగ్గోచరమగుట. దానినిచూచి ఆ వస్తువుయొక్క నిజరూపము అదియేనను విశ్వాసము పొందుటయు. ఇట్టి వస్తువుకున్న ఉనికిని "ప్రాతిభాసిక సత్యము" అని వ్యవహరింతుము. ఇదియే అధ్యాసకు పునాది. ఈ పునాదిపైననే శంకరాద్వైతమను పదము ప్రభవించినది. భవన నిర్మాణ మున్ను వెలుగు చూచినది.

మాయ యను తత్త్వమే లేనియెడల అధ్యాస, ప్రతిభాస యను పదములకుగాని మాయావాద ప్రతిపాదనకుగాని అద్వైతసిద్ధాంత సంసిద్ధికి గాని అవకాశ ముండెడిది గాదేమో! గ్రంథావలోకనము జేయ మాయ క్రియాశీలి యనియే తెలియుచున్నది. అదియొక తత్త్వము గానియెడల క్రియాశీలి గాజాలదుగదా! ఆ ఘటనాఘటన పటీయసియగు పరమేశ్వర శక్తియే మాయ యన నవకాశ ముండెడిదిగాదుగదా! కనుక దాని నొక భావపదార్థముగ పరిగణించుటే ప్రయోజనకరము.

తరువాత తార్కిక ప్రజ్ఞవల్లనో, వ్యాకరణ ప్రతిభవల్లనో, సంభాషణా చాతుర్యము వలననో, కల్పనాకౌశలము వలననో అట్టి తత్త్వము ఉన్నట్టి

దనియో లేనట్టిదనియో, అనిర్వచనీయమనియో రూపొందింప నవకాశము లున్నను మాయ నొక వ్యావహారిక సత్యముగ నంగీకరించనియెడల ఈ విశ్వమునందలి ప్రవృత్తి కొక ప్రాతిపదికయే లభింపదని సంభావింతును. ఈ సందర్భమున అజ్ఞుడనగు నా వివరణ నట్లుంచి, విజ్ఞులగువారి ప్రవచనములకూడ మననముతో గ్రహించి మన్నించవలసియున్నది.

"If according to Sankara, Iswara is but Bramhan invested with Maya and Maya as the matrix of names and forms is to be construed in an ultimate reference, as the Sakti or power of Iswara, the determination of Locus or Modus existendi of Maya becomes a question of first rate philosophical importance." (Study of Vedanta)

Says SAROJKUMAR DAS, *M. A., (cal) Ph. D. (Lond).,*
Prof. in Philosphy, Calcutta University,

For myself, I am lead to believe that Maya is essentially a form of energy credited with the dual function of Projecting the world appearance and of veiling the nature of the reality. ఇదీ, మాయ యను పదముపట్ల ఆసక్తియు, జిజ్ఞాసయు నాయందు రేకెత్తుటకు కారణము. శుద్ధమాయ కారణోపాధిగను, మలినమాయ కార్యోపాధిగను వివేచింప విషయము లగుచున్నవి. మాయయొక్క యీ రెండు రూపముల పరిజ్ఞానమును పొందనివారికి సత్య వస్తు సందర్శనము ప్రాప్తింపదు, కైవల్యము సిద్ధించదు. బ్రహ్మమునకు సహజములగు స్వరూపలక్షణములను, ఆయనకు మన మారోపించు తటస్థ లక్షణములను అవగాహనకు దెచ్చుకుని, మనన నిధిధ్యాసములతో, అసు

భూతికి దెప్పుకొనగలమేమోగాని, మాయయొక్క భావరూపమునైనను అవగాహనకు దెప్పుకొనుటంత సులభముగాదనియే తెలియుచున్నది.

కనుకనే తత్త్వసాధనయందు జీవేశ్వర జగత్తత్త్వముల విచారణకన్న మాయాతత్త్వ విచారణయే మిన్నయని అనిపించుచున్నది. ఇది నాలుగవ ప్రముఖతత్త్వముగ సంభావించి నిర్ధారించుటయే నాకు లక్ష్యము. జగత్కారణ మగు (that which projects the Jagat) ఈ పరమాత్మశక్తి ఇట్టి దని నిర్ణయింపజాలకనే ఇది అనిర్వచనీయ మన్నారు వేదాన్తులు. ఇది అసంభావ్యమనుచున్నారు అన్యులు. నా దృష్టియం దిది యొక భావపదార్థమే. జడమగు మనస్సున కందదు. అంతర్ముఖమైన మనస్సు నిర్విశేషమై, నిర్బీజ సమాజస్థితి సిద్ధించుకొన్నప్పుడు అది స్వీయశక్తియే యగును. అది ఆత్మకు భిన్నముగాదు. చంద్ర చంద్రికల సంబంధముతో విలసిల్లు అవిభాజ్య మిథున తత్త్వమే (the indivisible spouse) అర్ధనారీశ్వరతత్త్వమే యగును.

తత్త్వసారము : ఇంతవరకు సగుణప్రపంచ దృష్టి. దీని నధిగ మించిన- జీవులూ ఉండరు, జగత్తులేదు, ఈశానుడగు ఈశ్వరుడు ఉండడు, ఆ మాయయు మాయమే యగును. అది నిర్గుణస్థాయి, కారణస్థాయి, కేవల స్థాయి. ఇదియే ఆత్మతత్త్వము. ఇది ఏకైకము, కేవలము.

ఒక ఉపాధి (శరీరము) యున్నదనుకోండి. దీని నొక కుండతో పోల్చినయడల దీనియందుండెడు చైతన్యమే ప్రత్యగాత్మ. దీనినే ఘటాకాశ ముతో సరిపోల్చి బోధింతురు వేదాన్తులు. అన్ని శరీరములయందలి యుండు చైతన్యమును గమనించిన ఆ సమష్టిని పరమాత్మ యందురు. ఈ స్థాయిని అతిక్రమించిన పర్యవసించునది పరబ్రహ్మయే. అదియే ఆత్మయను పద ముచే సూచింపబడు శుద్ధతత్త్వము, అనగా నిర్గుణతత్త్వము ఆత్మతత్త్వ

మనుభూతికి వచ్చిన— సూచించేవాడుగాని, గ్రహించేవాడుగాని ఉందనే ఉండడు. అదియే సాక్షాత్కారమను పదమునకు భావము లేక సాయుజ్యము. ఇది అద్వైతభావ సాధకులకు మాత్రమే సిద్ధించును. అన్యులకు సాలోక్య, సారూప్య, సామీప్యాది స్థాయిలు మాత్రమే మోక్షసిద్ధిగ సంభావింపబడుచున్నవి.

కాగా, నాదబిందు కళాత్మక మీ జగత్తత్త్వమని సాంఖ్యులు చెప్పిన 24 తత్త్వములకు మరికొన్నిటినిచేర్చి 36 తత్త్వముల సంపుటి యీ మాయా తత్త్వమనిరి శాక్తేయులు. శివునికన్న శక్తియే మిన్నయని ఆ శివశక్తిని మూర్తిమంతముజేసి "మాయాదేవి" యను అభిధేయముతో సభక్తికముగ సంకీర్తించుచున్నారు భక్తులు. ఉపాసించి తరించుచున్నారు పీఠాధిపతులును. కనుక భౌతికముగ 36 తత్త్వములతో పారమార్థికముగ శివశక్తిరూపముతో శోభిల్లుచున్న ఈమాయ ఒక భావపదార్థమేగాని ఊహాగానము గాదని అంగీకరింపవలసి యున్నది.

శాస్త్రదృష్టికి— తమోగుణలక్షణమగు ఆవరణశక్తియు, రజోగుణలక్షణమగు విక్షేపశక్తులతో గూడినట్టిదే ఈ మలినమాయ. ఆవరణమనగా సహజమగు స్వరూపలక్షణములు పక్కగా మనసున హత్తుకొనకుండ మందగింపజేయుట. విక్షేపమన— మోహమును (భ్రాంతిజ్ఞానమును కలిగించి, ఉన్నవస్తువు ఒకటియైయుండ, అది మరొక రూపమున భాసమానమగునట్లుజేయుట) కలిగించుట.

**N B.** :- ఇట్టి భ్రాంతిజ్ఞాన సంజనిత దృశ్యస్ఫూర్తి ఒకప్పుడు ఆత్మాశ్రయముతై ప్రకటింపబడవచ్చును. (Subjective) అనగా సాక్షి

వివర్తముచే ప్రాప్తించవచ్చును. మరొకప్పుడు వస్త్వాశ్రయ పూర్వకముగ (objective) సంభవముగా వచ్చును. దీనిని ప్రమాతృ వివర్త ప్రక్రియ అందురు.

ఈ చర్చకు గ్రాహ్యాంశము : ఆవరణ విక్షేపములు లక్షణము లన బడును; లక్షణములు సర్వదా వస్త్వాశ్రయములై నందున, ఇవి రజస్తమస్సు లను పదార్థముల నాశ్రయించి ఆధారము జేసికొని యుంటవలన— **అవి** వస్తులక్షణము లనియు (**properties of matter**) నిర్ధారించవచ్చును. ఈ ప్రాతిపదికతో అజ్ఞానమునకు నేనిచ్చు నిర్వచనమును పరిశీలించండి. "రజస్తమోగుణము లనబడు పదార్థములు తమ గుణప్రభావపు వత్తిడిని (**impact**) మానవుని బుద్ధితత్త్వముపై ప్రసరించి ప్రభావితముజేయ ఉద్బుద్ధమగు భావరూపములే అజ్ఞానము తాత్పర్యము గలుగుచున్నది."

మాయ : పరబ్రహ్మ ప్రతిబింబయుక్తమై ప్రపంచముగ ఆవిష్కరణ బొందిన ఒక తత్త్వమే— అనగా నామరూపములకు బీజమునందలి **అంకురమువంటి తత్త్వమే !**

శ్లో॥ "బీజస్యాంతరివాఙ్కురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పున
ర్మాయాకల్పిత దేశకాల కలనావైచిత్ర్యచిత్రీకృతం
మాయావీవ విజృంభయత్యపి మహాయోగీ వయః
స్వేచ్ఛయా తస్మైశ్రీ ॥ —(శ్రీ ద. మూర్తి స్తోత్రము)

సాక్షాత్తు భగవత్పాదులగు శంకరుని యీ శ్లోకభావమును మననముతో నవగాహనకు దెచ్చుకొనక— చెట్టుముందా విత్తుముందా ? యను చర్చతో సతమతమగువారికి హృదయగ్రంథి విడిపోదు. చెట్టు, విత్తు రెండును ఒకే

బీజశక్తి యొక్క రూపములేయను సత్యము తెలియబడదు. శక్తి శక్తిమంతులకు గల అవినాభావసంబంధ మవగాహనకు రాదు. నామరూపములుగ ఆవిష్కరణబొందు తత్త్వము మాయయే. ఈ ఆవిష్కరణకు పూర్వరూప స్థితియందు పరిణామము పొందునదియు మాయయేగాని ఈశ్వరుడుగాదు అని మనకు తెలుప నుపకరించునది ఈ మాయయే. ద్వైత విశిష్టాద్వైతముల యందు పేర్కొనబడలేదీ మాయావాదము. అద్వైత ప్రతిష్ఠాపనకు ఆధారము ఈ మాయావాదమే.

## మాయకు నిర్వచనములు :

తమతమ జీవధర్మముల కనుగుణముగ వివరింపబడిన ఈ క్రింది నిర్వచనముల పరిశీలించి మాయాతత్త్వమును గ్రహింతము.

i. కూటో వంచనో మాయా

ii. యా-మా- సామాయా

iii. ఆవరణ విక్షేపసహిత అనాద్య నిర్వచనీయ భావరూపాజ్ఞానము మాయ.

iv. అఘటనాఘటన పటీయసీ పారమేశ్వరశక్తిరేవ మాయా.

i. కూటమన అసత్యము ఉ॥ కూటసాక్ష్యము. మాయకు మోసము వంచన యనియే సామాన్యముగ జెప్పబడు అర్థము. తత్త్వశాస్త్రమున దీని నన్వయించుటకు అనువగునాయని విచారించవలసి యున్నది. కొందరు తత్త్వబోధకులు మాయను ఐంద్రజాలికుని క్రియాకౌశలముతో బోల్చి మాయయు అట్టిదేనని అనగా మోసముతోగూడినదని అభివర్ణింతురు.

ప్రకృతము ప్రవాచకుడను నేను గనుక నా భావప్రసరణరీతినిగూడ స్పష్టము జేయుట నా విధియైయున్నది.

నిఘంటువునందు ఒకే పదమునకు అర్థములు భిన్నభావములతో దెలుపబడియుండుట మన యనుభవమే. ఉ॥ మాత్ర : i. మందుగోలి ii. పరిమాణము - పెసరబద్దంత - కందిగింజంత అనుట iii, నేత్రశ్రోత్ర జిహ్వాది ఇంద్రియములు, 'మాత్రా స్పర్శాస్తు కౌంతేయ' అను గీతాశ్లోక పాదమునందు మాత్ర ఇంద్రియములకే అన్వయము నిచ్చును. iv. పద చ్ఛేదమునందు ఇది ఒక శబ్దభాగమునకు మాత్రమే అన్వయించును. ఓం = అ-ఉ-మ = ఇవి syllabbs. పై జెప్పిన నిర్వచనములలో సందర్భము ననుసరించియే మాయకు సరియగు అన్వయమునిచ్చు నిర్వచనమునే మనము ఎంచి ఔచిత్యానుసారము సామరస్యముతో సమన్వయము జేసికొనవలయును.

ఇపుడు కూటోపంచనోమాయా అను నిర్వచనమునందు ఐంద్ర జాలకుని మాయాకౌశలమును ఎంచుకొనుటతో సామరస్యము సమకూరదు. ఏమన— ఒక ఉపాదాన పదార్థముండి, దానిని రూపొందించుటకు వలయు నిమిత్తకారణమగు తెలివియుండి జీవుల కర్మఫలానుభవమున కుద్దిష్టమైన కార్యకారణ భావముతో జరుగు సృష్టికార్యమును, వినోదమునకై సంకల్పిం చిన నొక క్రియతో పోల్చిచూపి, కుక్షింభరుడైన గారడివాని మామిడి మొక్క సృష్టి ఉదాహరణతో బోధించుటచేతనే తత్త్వశాస్త్ర మపహాస్యము పాలై హేతువాదభీతులకు ఊతము నిచ్చుచున్నది. ఐనను శ్రోతలు విశ్వ సించుచునే యున్నారుగదా ! భక్తకోటియందు బహుసంఖ్యాకులు అంగీక రించుచున్న అసభ్యభావము లింకనూ ఎన్నియో గలవు. మచ్చుకు నీవును

నేను పుట్టియేయుండలేదు అను బోధ యొకటి. ఇదియే అజాతవాద సిద్ధాంత సూక్తి.

మాయకు మోసమను అర్థమును వర్తింపజేసినయెడల వేదాంతము లౌకిక శాస్త్రముగ పరిగణించి గురుదేవుల నాశ్రయింప నవసరములేదనియే నా విశ్వాసము. మాయను మాపివేయుటకు భౌతికశాస్త్ర పరిజ్ఞానమే సహకారి కాగలదు. కనుకట్టును విప్పుటకు వేదాంతవిచారణ మెందుకు? ఇట్టి అపార్థముల నిచ్చు విమర్శలను, పవిత్రమగు, నిగూఢమగు మాయావాదమునకు సంబంధింపజేయు లౌకిక అపచారమే యగును. కనుక మాయయన మోసమో, వంచనయో, గారడీయో గాదు. అది మోక్షదాయకమగు నొక తత్త్వమే-ముక్తిమార్గమున కొక ద్వారమే. జ్ఞానసిద్ధి గలిగిన మాయ నశించునందురు గాని ఈమాయ కృతయుగంనుంచి ఈనాటివరకును క్రియాశీలిగ ప్రవృత్తి పొందుచునే యున్నది. ముందుతరమువారికినీ అది అంతే. జ్ఞానము సిద్ధించినవానికి మాత్రమే మాయ నశించును. అన్యులకు అనగా పండితులకు శాస్త్రజ్ఞానమువలన నశించునది మాయాస్వరూపముగాదు; మాయయొక్క కార్యమగు అజ్ఞానమని గుర్తుంచుకొను టవసరము. పై ప్రమాణమునందున మాయ యొక తత్త్వమేనని ఆదిదేవుని సహధర్మచారిణి యని, దేవుడున్నంత వరకు మాయయు యుండుననియే విశ్వసించవలయును.

1. యామా|సామాయా|యా = ఏది, మా = లేదో, సామాయా = అదియే మాయయని భావము. అసలు లేనిదానికి నిర్వచనమెందుకని శంక. ఇందొక సూక్ష్మమున్నది. అంటే- ఏది వాస్తవమున లేదో అట్టిదాని కొక కాల్పనిక ఉనికి చూపుటయే మాయాకార్యము. జ్ఞానమువలన నీకాల్పనిక ఉనికి నశించుచుండిగాని మాయయను తత్త్వము నశించదు. ఇందుకు అనాది

సిద్ధమైయున్న ఉదాహరణ రజ్జుసర్పమే. ఈ రజ్జువుపై నిజమగు సర్ప జ్ఞానమును గలిగించుటయే అధ్యారోప మనబడు మాయాకార్యము. జ్ఞానముచే ఈ కార్యము నశించి రజ్జుజ్ఞానము కలుగునుగాని కారణమగు మాయ నశించ దని గుర్తుంచుకొనవలసి యున్నది.

'మా' కు మరియొక అర్థము లక్ష్మియని చెప్పుచున్నారు. అంటే ఆత్మతత్త్వమును స్త్రీరూపమున భావించి, ఆదేవి బ్రహ్మతత్త్వమునందు "పరమంబై సుషమానిధానమగు నా బ్రహ్మంబులో బ్రహ్మియై, పరదశ్రీహరి యందు శ్రీ యగుచు సర్వప్రపాభవాధారియై" అను పద్యభాగము దెలుపునట్లు- సగుణబ్రహ్మకును ఆయన శక్తియగు బ్రాహ్మ యనబడు మాయకును అవిభాజ్య దాంపత్యభావము నన్వయించి (అర్ధనారీశ్వరభావము) బోధించుటయే ఇందలి తాత్పర్యము. అనగా సగుణస్థాయియందు శక్తి శక్తి మంతులకుగల అనన్య అవినాభావ బోధక మీ "లక్ష్మి" (మా) యని తాత్పర్యము.

3. "ఆవరణ విక్షేపసహిత అనాద్య నిర్వచనీయ భావరూపాఽజ్ఞానము మాయ". ఆవరణ = మూసియుంచుట, కప్పియుంచుట, ప్రజ్ఞాహీనము జేయుట. విక్షేపము = రూపురేఖలను అన్యవిధానములతో భాసింప జేయుట లేదా — అనంత స్వరూపమును పరిచ్ఛిన్నముగ ప్రదర్శించుట Showing the infinite as finite bodies; individuation; Distortion of Surface appearance.

ఆవరణ విక్షేపములు మలినమాయకు లక్షణములు. ఇవి వస్త్వాశ్రయములు (objective aspects). ఇవి తమస్సు రజస్సు అను పదార్థముల నాశ్రయముగ జేసికొని యుండుటవల్ల వీటిని వస్తులక్షణములు (properties

of matter) గ సంభావింపవలయును. కనుక రజస్తమోగుణ ప్రభావపు వృత్తిడులు (impacts) మానవుని బుద్ధితత్త్వముపై కల్పించు మలిన భావముల ప్రభావమే అజ్ఞానమని- అనిర్వచనీయ మనబడు అజ్ఞానమునకు నా నిర్వచనము. Nescience is the effect of the impact of Rajas and Tamas on the human intellect.

తాత్పర్యమేమన— మాయ తనయందలి సత్త్వగుణ ప్రభావముచే పరబ్రహ్మను ప్రతిబింబింపచేయుచున్నది. ఈ భావము విషయమున ఒక శంక కలుగుచున్నది. ఏమన— అసలు బింబరూపమేలేని అనంత తత్త్వమునకు ప్రతిబింబ మెట్లుపపన్న మని. అనంతాకాశమునందలి ఘటాకాశమువలె ఆ దేశమునకు ఆ కాలమునకు మాత్రమే పరిమితమైనందున బింబ భావమున కుపపత్తి కలిగినది. ఇది పరిచ్ఛిన్నభావము (individuation) ఇది వ్యావహారికమున బోధనాసౌకర్యమునకు ప్రతిపాదింపబడినది. వాక్యము మాత్రమే. తాత్త్విక జ్ఞానము పొందినవానికి— కుండలోని ఆకాశము బింబ ప్రాయముగ నున్నను, కుండ అనంతాకాశమునందే అంతర్గతమైయున్నదను ఎరుక గలిగితే ఈ ప్రతిబింబభావము సమర్థింపబడుతుంది. ఇట్టి ప్రతిబింబ యుక్తమై జగద్రూపముగ ఆవిష్కరణపొందిన ఒక తత్త్వమే ఈ మాయ ఇందుకు పూర్వరూపమగు పరిణామ ప్రక్రియ మాయకేగాని ఈశ్వరునకు గాదను సత్యమును ఆరూఢముగ దెలుపుచున్నదీ మాయావాదమే. అనగా the ever changing and the never changing principles అగు తత్త్వములను దెలుపు సగుణ స్థాయీకారక తత్త్వమే మాయ. ఇది అనాదికాలమునుండియు తన యునికిని ప్రస్ఫుటించుచు అవిద్యయను మూలాజ్ఞానముతో గూడినట్టిదియు, స్వరూప మిట్టిదని నిర్ణయింప నలవు గానట్టిదియు,

భావరూపమాత్ర మైనట్టి అజ్ఞానమే ఈ మాయ యనియు మూడవ నిర్వచన తాత్పర్యము అందుచే స్థూలముగనైన నిర్వచింప ననువగు నొక తత్త్వ మీ మాయ.

"మా" యన నొక కొలతలేక పరిణామమును (unit of measurment) దెలుపు సంకేతము. అనంతమగు బ్రహ్మమునందు పరిచ్ఛిన్న దృక్పథములు, వ్యక్తికి పరిమితములగు భావములును సంభావితము లగుట. కనుక పరిచ్ఛిన్నభావముల నపవదించి అనంత భావసిద్ధిని పొందుటకు ప్రధాన సాధనము మాయను అవగాహనకు దెచ్చుకుని దానినుండి విముక్తి పొందుటయే యని "ఇష్టసిద్ధి" యను గ్రంథమునందలి బోధ. మాయ యన లేనిదని గాదు తాత్పర్యము. సత్పదార్థమునం దసత్పదార్థ భావస్ఫోరక శక్తియే మాయ. జ్ఞానసిద్ధి గలుగువఱకు, జ్ఞానేశ్వర భేదభావము పోవునంత వరకు మాయ నశించదు. జ్ఞానసిద్ధి లభించినవారికి మాత్రమే మాయయు మాయాకార్యములును నశించును. విద్వాంసులకు మాయాకార్యములు అవగాహనకు వచ్చునుగాని, మాయకు లయప్రాప్తి లభించదు.

4. "అఘటనాఘటన పారమేశ్వరశక్తి రేవమాయా" అని అనునది వ్యాసపుత్రుడగు శ్రీ శుకుని నిర్వచనము. తాత్పర్యమేమన— చిత్శక్తియై యుండియు జడశక్తిగ ఆవిర్భవింప సమర్థమైన శక్తియే మాయ యని. సాక్షాత్తు పరమేశ్వరశక్తియే గనుక ఆయన కది భిన్నమై యుండజాలదు. ఆయన స్వరూపాంశయే గావలయును. అట్టి దివ్యశక్తి యొక తత్త్వముగాక గారడివాని కనుకట్టు కర్మవంటిదగునా? విజ్ఞులు వివేచింతురుగాక! పరమంబై సుషమానిధానమగు తత్త్వము బ్రహ్మంబులో బ్రహ్మగాక, ఒక తత్త్వము గాక మరేమగును? మాయా దేవీ విజయతే తరామ్!

సృష్టి నిత్యసత్యముగానిదైనను— దృశ్యసత్యముగనైనను నున్నది గదా ! అని విచారించినయడల గీత అ. 4 శ్లో. 6 న లభించు వెలుగున చక్కగా గ్రహింప నవకాశమున్నది, కేవలం అచలమగు తత్త్వమునుండి ఈసృష్టి ఎట్లు సంభవమైనదని ఒక శంకయు కలుగును. అది యెట్లన—

శ్లో॥ అజోఽపిసన్ అవ్యయాత్మా । భూతానామీశ్వరోఽపిసన్ ।
ప్రకృతిస్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా ॥ (4-6)

భావము : ఓ విజయుడా! నేను అజుడను. అనగా ఎప్పుడో ఒకప్పుడు పుట్టినవాడనుకాను. అవ్యయుడను = నాశము గలవాడనూగాను. సర్వప్రాణులకును నియామకుడను. ఐనను నా స్వరూపమునందొక అంశ యగు మాయాశక్తివలన పాంచభౌతికమగు ఈ సర్వసృష్టిరూపములో ఆవిర్భవించి ఈశ్వరజీవజడములనెడు మూడు తత్త్వముల ఆకారములతో విలసిల్లెదను. కనుక ఈసృష్టి నా మాయావిలాస మనియు, జీవకోటిని నేను మోసముజేయుట గాదనియును తెలియవలెను— "మాయాంతు ప్రకృతిం విద్ధి । మాయినంతు మహేశ్వరం" అను వాక్యార్థమును పరిశీలించి అవగాహన జేసికొనిన– ఇది నా మాయాశక్తియొక్క పరిణామముచే ఆవిర్భావమైనట్టి ప్రకృతిగనుక నా స్వరూపమునందు ఎట్టి మార్పున్ను జరుగదను సత్యమును అవగాహన జేసికొనుము. భౌతికశాస్త్రములందును పదార్థము-శక్తి అను రెండు అవస్థలు గలవు. (State of Physical Energy and solid matter) దీనిని గ్రహించినవారికి పారమార్థికశక్తి (Spiritual Energy) పదార్థములుగ నెట్లు పరిణతి పొందునో అవగాహన కాగలదు. కనుకనే వివర్తప్రక్రియకు పూర్వము పరిణామప్రక్రియయు

శాస్త్రసమ్మతముగ బోధింపబడుచున్నది. కనుక మాయ యనునది తన సహజస్థితియందు పరమేశ్వరుని పరాశక్తియనియు అదియే వివర్తమువలన చిచ్ఛక్తి జడశక్తి రూపములుగ పరిణతినొంది సృష్టికార్యమునకు ఉపాదానమగుచున్నదనియు అందుచే అది త్రిగుణ సామ్యావస్థయగు మూలప్రకృతి యనియు ఈ సామ్యావస్థకు భంగము వాటిల్లినయడల అది సత్త్వరజస్తమోగుణములతో గూడియుండు పదార్థమగుననియు పర్యాపసించు చున్నది. ఇట్టి మాయాపరిణామమునకే మిథ్యాపరిణామము, వివర్తపరిణామము విలాస పరిణామ మను పేర్లున్ను ప్రసక్తమగుచున్నవి. ఈ విధముగ అవగాహన పొందినవారికి, ముఖ్యముగ వైజ్ఞానిక చిత్తవృత్తిగలవారికి (To the Scientific minded persons) ఏ కర్తృత్వము అంటగట్ట నవువుగాని ఆదితత్త్వమైన శుద్ధ బుద్ధ ముక్త చైతన్యమునుండి కార్యము ప్రభవించుటకు పలయు శక్తి, ఆశక్తినుండి పదార్థ ముద్బుద్ధమగు విధానము, దానిని పరిణమింపజేయు నిమిత్తకారణమగు తెలివి, ఈ ప్రక్రియలతో సంభవమగు సృష్టి అనగా నిమిత్తోపాదానకారణముల స్వరూప స్వభావములు బోధపడి ఆ రెండును బ్రహ్మయేనను జ్ఞానపరాకాష్ఠపూర్వక అనుభూతిచే 'జగద్బ్రహ్మ' యను భావము ఆరూఢమైనప్పుడు మాత్రమే అద్వయమైన ఆత్మతత్త్వము నుండి విశ్వాకారమైన ఈ ద్వైతము ఎంతగా సంభవమైనను—— ఆ మూల తత్త్వమునందు మాత్రము అద్వైతభావమునకు హాని కలుగదను సత్యము విశ్వసనీయము కాజాలదు. అప్పుడుగాని అచలమగు సంవిత్- లేక ప్రజ్ఞానము లేక పరంజ్యోతి అను పర్యాయపదములచే పరిభాషింపబడు పరబ్రహ్మ తత్త్వానుభూతి ప్రాప్తించదు. ఇందుచే మాయాశక్తియొక్క పరిశీలన ఆత్మతత్త్వ వివేకము పూర్తియగుటకు ఆవశ్యకమై యున్నది.

ఆత్మతత్త్వ మొక్కటియే సర్వసృష్టికిని వలయు వివర్తమునకు అధిష్ఠానమని తెలుపు బోధయే మాయావాదమని స్పష్టగ్రాహ్యమగుచున్నది.

ఇట్టి మాయావాదమును గీత ఇంకను బలపరుచుచున్నది.

శ్లో॥ త్రిభిర్గుణమయైర్భావై । రేభిసర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి । మామేభ్యః పరమవ్యయమ్ ॥
(అ. 7 శ్లో 13)

శ్లో॥ దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా
మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే ॥ (7-14)

భావములు : 13. విజయుడా! సాత్విక, రాజస, తామసము లను మూడు భావములవల్ల రాగ ద్వేష మోహములు ప్రాప్తించి ఈ జగత్తునందు వ్యామోహాలు కలుగుచున్నవి. పరాప్రకృతి సంయోగముచే రజ్జుసర్పములట్లు దృశ్యమానమగు సకల భూతభావములును శబ్దాది విషయములచే రాగద్వేష పూరితులై నన్ను నా పారమార్థిక స్వరూపమున జూడజాలకున్నారు — అంటే, తమ స్వస్వరూపభావమును పొందజాలకున్నారు.

14. పరా-అపరరూపములతోను త్రిగుణములతోను కూడియుండి యున్నదగు మాయాశక్తి ఈశ్వరసంబంధమైనది గనుక దాని నతిక్ర మించుట కష్టము. మాం ఏవ అనగా (ఎవరైతే సర్వ జీవ ధర్మములను విడచి) కేవల స్వరూపుడనగు నన్నే పొందుచున్నారో వారే మాయవలన కలుగు అజ్ఞానమును దాటు సమర్థులగుచున్నారు. అంటే సర్వజీవ ధర్మము లను వదలి ఆత్మధర్మముల నెవరు పొందుదురో (మమసాధర్మ్యమాగతః) వారే ఈ మాయను దాటగలరు.

కార్యబ్రహ్మస్థాయియం దీమాయ అర్ధనారీశ్వరి. బ్రహ్మమునందు బ్రహ్మి; శ్రీహరియందు శ్రీయయి సర్వప్రాభవాధార యగును. ఇది ప్రస్థానములు మూటియందును పేర్కొనబడుచునే యున్నది. ఐనను శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమునందు సంకలనముజేసి ఒకేచోట ప్రతిష్ఠింపబడినందున ఆ భావములు సుబోధకములై యున్నవి. అందు జ్ఞానాష్టక మనబడు శ్లోకములయందు రెండు మూటిని అవగాహన జేసికొందము.

శ్లో॥ విశ్వందర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథానిద్రయా ।
యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమేవాద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయే నమయిదం శ్రీ దక్షిణామూర్తయే ॥

ఈ శ్లోకమున నిజాంతర్గతం అనుమాట ప్రధానమైనది— ఏమన చరాచర ప్రపంచమంతయు ఒక అద్దములో ప్రతిబింబించు నగరము, ఆ అద్దమునందే అంతర్గతమైయున్నట్లు కనిపించుతీరున, జీవేశ్వర జగత్తు లనబడు అధ్యారోపిత తత్త్వములు మూడును నిజాంతర్గతములు అనగా ఆ సర్వాత్మతత్త్వమునందే అంతర్గతమై యుండియు- ఆత్మకు బాహ్యమునందున్నట్లే స్ఫురించును. ఇందుకు దృష్టాంతముగ స్వప్నము ప్రసక్తమగుచున్నది. స్వప్నమునందలి దృశ్యములు స్వప్నద్రష్ట మెదడునందే ప్రభవించుచున్నను, ఆ దృశ్యములు, అతదెక్కడి విమానములు, ఆతనికి బాహ్యమున నున్నట్లే గోచరించుచున్నవిగదా ! అట్లే— (యథానిద్రయా) సర్వచరాచర జగత్తున్ను సర్వవ్యాపియైయున్న ఆత్మయందే అంతర్గతముగ నుండియు మాయాశక్తి ప్రభావమువలన తనకంటె వెలుపలనున్నట్లే తెలియబడుచున్నది. మరియు "స్వాత్మానమేవాద్వయం" అను బోధ జీవతత్త్వము

భ్రాంతిజ్ఞానమువలన అజ్ఞాన భూమికయందు ప్రమాతగ తెలియబడుచున్నను జ్ఞానభూమికయందు తానే శుద్ధచైతన్యతత్త్వముగ అనగా ఆ సర్వాత్మ తత్త్వము తానే యని అనుభూతి పొందును. ఈ అనుభూతి ప్రాప్తించుటకు ఈ మాయాతత్త్వవివేకము పొందుటావశ్యకము. ఇందుకు గీత 7-13-14 అధ్యాయములు సహకారులు కాగలవు. మరొక శ్లోకభావమును గ్రహింప యత్నింతము.

శ్లో॥ బీజస్యాంతరివాంఙ్కురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం
పునర్మాయా కల్పిత దేశకాల కలనావైచిత్ర్యచిత్రీకృతం ।
మాయావీన విజృంభయత్యపి మహాయోగీవయః స్వేచ్ఛయా ॥
—తస్మైశ్రీ

భావము : ఒక గింజయందు కారణరూపముననున్న మొలక వర్షాది పరిస్థితుల ప్రభావముచే కార్యరూపములగు కాండము, శాఖలు, పత్రపుష్పములుగ పరిణమించి పుష్పించి ఫలించి ఆ ఫలములయందలి కారణరూపమును బీజములందు ప్రస్ఫుటించుటను పరిశీలింప, స్థూలమగు కార్యములు (వస్తువులు) సమస్తము సూక్ష్మమునుండియే రూపొందునని తెలియుచున్నది.

"మట్టి" అను పదము ఆచెట్టు ఆకులకు, కొమ్మలకు, కాయలకు, ఊడలకు- ఆ చెట్టునందలి సర్వమునకును వర్తించునట్లు, ఎట్టి కార్యమునకైనను సూక్ష్మరూపాంశయే ఆధారమని, ఆ సూక్ష్మరూపమే ఆత్మయని మట్టిఆకు, మట్టికాయ, మట్టివూడ అను మాటలవలన తెలియుచున్నది. ఇందు "మట్టి" కారణాంశయు ఆకులు, కాయలు, ఊడలు కార్యములనియు తాత్పర్యము. "మట్టి" అనేది మార్పులేని ఆత్మతత్త్వమువంటిదికాగా,

ఆకులు కాయలు మున్నగునవి మాయాశక్తి పరిణమింప ప్రాప్తించినవనియే గ్రాహ్యాంశము. ఇదియే కార్యకారణభావము. కనుక కార్యకారణములకు భేదములేదు. తాత్త్వికముగనున్న స్థితి అనన్యత్వమే. ఈ అనన్యత్వమే ఆత్మతత్త్వానుభూతి.

తత్త్వసారమేమన— ఈ ప్రపంచము పంచీకరణ ప్రక్రియచే ప్రభవించుటకుముందు భోక్త-భోగ్యములవంటి భావరహితమును, నిర్వికల్పమును అయిన సన్మాత్రముగ నుండెను. అనగా ఆత్మతత్త్వమే అయియుండెను; సద్రూపమున ఏకైకమై, కేవలమైయుండెను. అదియే కారణరూపము. కాని ఈశ్వరాధిష్ఠితమగు మాయచే కల్పింపబడిన దేశకాలములచే వివిధ నామరూపములుగ విభక్తమై సృష్టి జరిగెను కనుక ఈ మాయాతత్త్వమునకు ఆధారమైనదే ఆత్మతత్త్వము. సన్మాత్రమన అసత్పదార్థ సంబంధము లేని కేవల సత్పదార్థమగు బ్రహ్మము మాత్రమేనని భావము. Where ever there is an external material process, it is but one side or aspect of the real Subtle Process.... the Arman· Thinking Substance and extending substance or one and the same. (Spinoza)

ఆత్మతత్త్వ విషయకమగు భావములు వేదాన్తమునకు సంబంధించినవైయున్నను యోగ. అ. 4. స 12-13 సూత్రములున్ను ప్రకృతిని పరిగణించి ఎట్లు ఆలంబనము నివ్వనగునో తెలుపుచున్నవి.

"అతీతా నాగతామ్ స్వరూపతోఽస్త్యధ్వభేదా ధర్మాణామ్" 12.

"తేవ్యక్తసూక్ష్మా గుణాత్మానః" 13.

అతీతం = వినాశము పొందనిది.

అనాగతం = భవిష్యత్తునందు వ్యక్తమగునది.

ధర్మములు = వాసనలు = instincts

వాసనలు స్వరూపనాశము నందవు. వాటియందు అతీతత్వము కలుగుచుంటయే వాటికి నాశన మనబడును. అనగా నిజమునకు నాశనము లేకపోయిను వ్యవహారమున ఉన్నట్టేయుండి అదృశ్యమగుట, మరియు భవిష్యత్తున రూపొంది దృశ్యమానమగుటయు.

వ్యక్తసూక్ష్మాః = వర్తమానమందు వ్యక్తమగుచున్నట్టియు అతీతానాగతములు సూక్ష్మములు.

అహంకారము మున్నగు ప్రకృతికార్యములన్నియు త్రిగుణస్వరూపములే. ప్రకృతి సంబంధములగు సత్త్వరజస్తమోగుణములు పరిణామనిత్యములు. వాటి వికారములైన సర్వభావపదార్థములును ప్రకృతికి అభిన్నములే అంటే ప్రకృతికి సంబంధించినవే అయినందున నిత్యములే అయినప్పటికిని పరిణామనిత్యములేగాని, స్వరూపనిత్యములు గావు. ప్రత్యగాత్మ అనబడు కూటస్థుడుమాత్రము మార్పుల బొందని ఆత్మ్మడు. ఈతడు త్రికాలములయందును మార్పుల బొందడు. ఈతడే సర్వాత్మయైన పరమాత్మ. ఇదియే ఆత్మతత్త్వ స్వరూపము.



## — గీతాబోధ - ఆత్మతత్త్వము —

ఆత్మతత్త్వ వివేక సముపార్జనకు ఇంతవరకు

i. అవస్థాత్రయమును ప్రాతిపదిక తీసుకొనియు

ii. ఉపనిషద్వాణి ప్రవచనముల గ్రహించియు

iii. ప్రత్యభిజ్ఞా దర్శనమునందలి శివాద్వైతమును

iv. మాయావాద పరిశీలనవల్లను ప్రయోజనము పొందితిమి.

ఇక ఆత్మతత్త్వమును ప్రస్థానములలో ప్రసిద్ధమైన భగవద్గీత ఎట్లు బోధించునో గ్రహింతము. గీతయందలి బోధను అవగాహనతో నేర్చుటకు ముందొక ధర్మసూక్ష్మమును గమనించి గుర్తుంచుకొనుట అవశ్యకము. ఏమన— అర్జునునకు కలిగిన విషాదము అను దోషము మనస్సుకు సంబంధించినట్టిదని మన సామాన్యజ్ఞానమున కందు విషయము. అందుచే

శ్లో॥ క్లైబ్యం మాస్మగః పార్థనైతత్త్వ య్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతపా॥ (అ2. శ్లో.3)

అను శ్లోకభావము ఏమన— నపుంసక భావమగు భయము నీయందు కలుగుట యుక్తముగాదు. హృదయదౌర్బల్యమును మనశ్చాంచల్యమును విడిచి యుద్ధసన్నధుడవు కమ్ము ! అను వాక్యములు, మనోధైర్యము కలిగించుటకు సామాన్యులుజెప్పు పదములుగనే మనకు దెలియవచ్చుచున్నవి. ఇంకనూ మరికొంతవరకు ప్రేరేపించి ఉత్తేజపరచుటకు "అనార్య జుష్ట మస్వర్గ్య అకీర్తికరమ్"— అనగా శిష్టులగు ఆర్యులచే పొందబడనట్టిది స్వర్గమునకు దూరము జేయునట్టిది, నీవంటివారి కీర్తికి భంగకరమైనదియని చెప్పి,

మనస్సుకు స్థైర్యము కలిగించుట ఫలప్రదముగా యున్నందున— భౌతిక మగు మనస్తత్వశాస్త్ర ముపకరింపదను భావముతో పారమార్థికమగు ఆత్మ తత్త్వ శాస్త్రమును— జ్ఞానవిజ్ఞాన భావములతో పరాఽపరప్రకృతులబోధతో క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపముల బోధతో జ్ఞానములలోకెల్ల ఉత్తమమగు గుణత్రయ విజ్ఞానబోధతో మరియు పురుషోత్తమతత్త్వ జ్ఞానోపదేశముతో చిత్తమునకు స్వస్థత కలిగింపవచ్చునని భావించి మనస్సునకును అధిష్ఠానపర మగువివేకమును అందింప యత్నించి సఫలుడయ్యెను. కనుక భగవద్గీత మనస్తత్వ ఆత్మతత్త్వ ప్రదాయియని మనము గ్రహింపవలయును. It is a Science of both meterial and metaphysical psychology. Psyche is soul or the Jeeva wipe off the nescience of the Jeeva and expose it as the Atman or the thing in-itself or the Substratum, is meta Physical Psychology. ఈ విషయము 'విజయగోపాలమను మా గ్రంథమునందు ఒక ప్రత్యేకా ధ్యాయముగ ప్రదర్శింపబడినది'. పై జెప్పిన విషయమును భగవద్గీతకు తాము రచించిన భాష్యారంభమునందు శ్రీ శంకరు లిట్లు దెలిపిరి.

"మహతి శోకసాగరే నిమగ్నస్య అర్జునస్య ఆత్మజ్ఞానాత్ అన్యత్ర ఉద్ధరణ మపశ్యన్ భగవాన్ వాసుదేవః కృపయా అర్జునం ఉద్దిధారయిషుః. ఆత్మజ్ఞానాయ అవతారయన్ ఆహః."

భావము : సంగ్రామసన్నద్ధుడై వచ్చిన అర్జునుడు తన గురుదేవులు, ఆప్తులు, అనుంగు బంధుగులు ఆని యందు హతులగుదురని విషాదపడుచుండ ఆతని రథసారథిగ వచ్చియుండిన బావయగు కృష్ణుడు భగవానుడై ఆతని మనస్సుకే సారథ్యమువహించి ఆతని విషాదమునకు త్రిగుణముల ప్రభావము

వల్ల ఆత్మవిషయమున కలిగిన అసంభావన విపరీతభావనలే కారణమని గ్రహించి, ఆత్మజ్ఞానముచేతగాని ఆతని అంతఃకరణమునను సంభవించిన అజ్ఞానపుటామయము తొలగి స్వస్థత కలుగజాలదని భావించి ఆత్మతత్త్వ వివేకమును బోధించెను. ఆత్మతత్త్వమే భగవద్గీతకు విషయము. అపుడు అర్జునునకు క్లైబ్యముపోయి ధీరుడై రణరంగమున నిలిచెను. కనుక గీతాబోధ భౌతికమునకు సంబంధించిన మానసిక చికిత్సగాదు. అది భౌతికమును పారమార్థికముతో ప్రభావితముజేసి చెప్పిన జ్ఞానవిజ్ఞానబోధ. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగములజేసియు గుణత్రయ విభాగముజేసియు ఉపదేశించిన ఆత్మతత్త్వ వివేకపూర్వక అపూర్వబోధ. అనగా ఆత్మస్వరూప వివేకము కలిగించుటచే చేయు చిత్తసంస్కరణ. కనుకనే ఇది An exposition of the metaphysical Principle యని పేర్కొనబడుచున్నది. ఈ చికిత్సా విధానమును ఆయుర్వేదమున మంగళాచరణ శ్లోకము ఎంతచక్కగా సూచించినదో వినండి :

శ్లో॥ రాగాదిరోగాన్ సతతానుషక్తాన్ అశేషకాయప్రసృతా నశేషాన్ ।
ఔత్సుక్యమోహాఽరతిదాన్ జఘాన యోఽపూర్వవైద్యాయ
నమోఽస్తు తస్మై॥

భావము : రజస్తమోగుణ ప్రభావము మనస్సుపై ప్రసరింప రాగాది రోగములు ప్రభవించి శరీరవ్యాధులు కలుగును. అనగా రాగ, ద్వేష, కామ, క్రోధాదులకు దేహమునందలి నరములపై కుపిత, ప్రశాంతాది ఉద్వేగముల స్పందింపజేసి వాహికారహిత గ్రంధులపై (ductless glands) ప్రభావమును ప్రసరించి వాత పిత్త కఫములను త్రిధాతువుల సహజ ధర్మములను అస్తవ్యస్తముజేసి దేహవ్యాధుల గలిగించును. కనుక వీటికి దేహ

చికిత్సలేగాక పారమార్థికమునకు సంబంధించిన తాత్త్విక చికిత్సలచేతగాని సంపూర్ణస్వస్థత కలిగింపబడదు. అజ్ఞానము అరతి మున్నగు నీ మానసిక వ్యాధుల తొలగించి ఆత్మకు స్వాస్థ్యము కలిగించు అపూర్వవైద్యుడగు నారాయణునకు నమస్కరించుచున్నాను. ఈ సందర్భమున శ్రీకృష్ణుడే అట్టి అపూర్వవైద్యుడు ఆత్మజ్ఞానముచే చిత్తశాంతి వివేకము ధర్మానురక్తియు గలిగించి తద్వారా దేహధాతువులను సంస్కరించి మానవునకు ఆరోగ్యము కలిగించు విధానమిది. ఈ చికిత్సాసూత్రమును మన అందరికీ వర్తింప జేయుటకే అర్జునుని మాధ్యమమున గీతాబోధ ప్రసక్తమైనది. ఆత్మజ్ఞానముతో మనస్తత్వమును సరిదిద్దుటయే ఇందలి సూత్రము. దేవాసుర సంపత్తులకు మానసిక స్వస్థతయే మూలకందము.

స్వస్థత యన నేమి ? ఆయుర్వేదభాషము వినండి :

శ్లో॥ సమదోషస్సమాగ్నిశ్చ సమధాతుమలక్రియః
ప్రసన్నాత్మేంద్రియ మనాః స్వస్థఇత్యభిధీయతే ॥

భాషము : మనస్సుతోగూడ పదునొకండగు ఇంద్రియములు, ఆత్మయు ప్రసన్నముగ ప్రశాంతముగ నున్నప్పుడే మనము ఆరోగ్యవంతులము. ఇది ప్రాప్తించనపుడు ఎంత కండలు తిరిగిన యోధుడైనను అస్వస్థుడే. ఇట్లు స్థితప్రజ్ఞుడు గానివానికి వేదాంతము నిరర్థకమేయగును.

"అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే" అను శ్లోకమున అర్జునా ! భీష్మ ద్రోణాదులు చత్తురని విలపించుచుంటివి కానీ దుర్యోధన దుశ్శాసనాదులు గత ప్రాణులుగాక బ్రతికియే యుంటే. నీ యందలి రాగ

ద్వేషాదులు ప్రకోపించి ప్రబలి వారిని చంపి సంతసింపదలచుచున్నావు. శోకమోహములు సప్తధాతుమయః పిండమునే ఆత్మగా భావించువారికి మాత్రమే సంభవించును. దీనిని "దేహాత్మబుద్ధి" యందురు. ఇది తొలగిన వారికే ఆత్మతత్త్వానుభూతి అతిశయించి అమృతస్వరూపు లగుదురు.

శరీరము స్థూల సూక్ష్మ కారణరూపములతో గూడియున్న ఒక సంపుటి. గీతయందు ఇది క్షేత్రమని పేర్కొనబడినది. ఇది మనోబుద్ధ్యహంకారములతో కూడియున్నది. ఇట్టి క్లిష్టమగు (complicated) సంపుటి యగు ఈ శరీరమునం దంతర్యామియైయుండి సర్వము తెలిసికొనుచుండు ప్రజ్ఞయే చైతన్యము. Consciousness = ఎరుక. ఈతడే క్షేత్రజ్ఞుడు- ప్రత్యగాత్మ- కూటస్థప్రతిభాసయగు చిదాభాసుడు. ఈ భావమును గీత ఎట్లు తెలిపెనన—

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాంవిద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్ర క్షేత్రజ్ఞ యోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ (13-2)

సర్వక్షేత్రములయందును క్షేత్రజ్ఞుడనబడు చైతన్యమును నేనే నని తెలుసుకో! ఈ క్షేత్రజ్ఞుడని వ్యవహరింపబడు హిరణ్యగర్భతత్త్వమగు నాకును ఆ సర్వాత్మ తత్త్వమగు బ్రహ్మమునకును అభేదమేగాని భేద మునునది లేదు. I and my father are one. అంటే, "తాను" అను పదమునకు చైతన్యరూపుడైన ప్రత్యగాత్మయే సమ్యక్ భావము, ప్రత్య గాత్మగ తెలియబడుచున్న నేను పరమాత్మకు అనన్యతత్త్వమునని తెలియు టయే వేదాంతశాస్త్ర లక్ష్యము.

శంక :. భ్రాంతచిత్తులగు జీవులను, కేవల జ్ఞానస్వరూపుడగు పర మాత్మతో అభిన్నునిగ పరిగణించుటెట్లు? ఇందుకు సమాధానమే

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష ఇష్యామి మాశుచ. (గీత. 18-66)

ఇదియే గీతాబోధకు ఉపసంహార శ్లోకము. ఇంపలి కీలకము : వ్యక్తుల దృక్పథములబట్టి ఏ ప్రవచనమునకైనను లభించు వివేకము వారి వారి జీవధర్మముల కనుగుణముగ భేదించుట మన అనుభవమే. జీవధర్మములన మోక్షాపేక్ష గలవారిలో కర్మనిష్టయందభిరుచిగలవారు కొందరుకాగా-సాంఖ్యనిష్టయందభిరుచిగలవారు మరికొందరున్నారు. కర్మనిష్టులు ఐహిక ఫలముల నపేక్షించువారు కొందరు. జ్ఞానవైరాగ్యములనే లక్ష్యముగ పెట్టుకొని నిష్కామపూర్వక, చిత్తశుద్ధి ప్రాప్త్యైకలక్ష్యముతో బ్రహ్మభావముతో బుద్ధ ముక్త స్వరూపులు గావలెనని చిత్తవృత్తులనణచి అమనస్కులై పరబ్రహ్మస్వరూప సంసిద్ధినే— సాయుజ్యము నపేక్షించు జ్ఞానయోగులు కొందరు గలరు. వీరు దేహాత్మభావముచే సంభవమగు అహంకార మమకార కర్తృత్వ భోక్తృత్వాది సర్వజీవధర్మములనుండి ముక్తులై స్వరూపానుభూతికై ఆ సచ్చిదానంద స్వరూపుడగు ఏకైకతత్త్వమును శరణు బొందుదురు. కనుక సాంఖ్యనిష్టయే తరణోపాయమను తాత్పర్యము లభించుచున్నది. జీవధర్మములనుండి ముక్తుడై ఆత్మధర్మముల నాహ్వానము జేసికొన్నప్పుడే పరమార్థప్రాప్తియని పర్యవసించుచున్నదీ శ్లోకభావము. జీవధర్మములు త్రిగుణాత్మికయగు ప్రకృతివలన ప్రాప్తించును. స్థూల సూక్ష్మ శరీరములేగాక కారణ శరీరముకూడ నశించినప్పుడే ఆత్మధర్మముల బొందుటయు. విజయ గోపాలము అను నా గ్రంథములో సర్వ (జీవ) ధర్మాన్ అను పదవివరణయే నాకు "చిత్కళాతపస్వి" యను అభినందనను సంతరించి యిచ్చినదని సవినయముగ విన్నవించుకొనుచున్నాను.

తత్త్వసారమేమన— ఆత్మ (తాను) అని చెప్పబడుచున్న తత్త్వము. స్థూల సూక్ష్మ కారణశరీరములకు బాహ్యాంతరముల వ్యాప్తమైయున్న శుద్ధ బుద్ధ ముక్త చైతన్యమే— అనగా జీవాత్మ పరమాత్మలకు అధిష్ఠానభూతమైయున్న అచల పరిపూర్ణ పరబ్రహ్మతత్త్వమే. It is the highest plane of consciousness called the Unity Consciousness.

మనసుతోకూడిన జ్ఞానేంద్రియము లారును లేకయుండియు వాటి గుణములచే ప్రకాశించునట్టిదియు సర్వప్రపంచమును ధరించుచు త్రిగుణ కార్యములకును సాక్షియగునదియే ఆత్మ.

శ్లో. సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితం।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥ (గీ. 13-14)

శ్లో. కర్మణ్యకర్మయః పశ్యేద కర్మణిచ కర్మయః।
సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్ ॥ (గీ.4-18)

భావము : ఇచట కర్మయనగా దేహేంద్రియ మనోబుద్ధులతో గూడియున్న నామరూపప్రపంచము. అకర్మయన నిర్వికారము నిరంజనము జ్ఞానమాత్రము నగు ఆత్మస్వరూపము. ఈకర్మ అకర్మను అధిష్ఠానముగ జేసికొని రజ్జుసర్పాదులట్లు బయలువెడలివట్టిదనుట వాచారంభణము మాత్రమేనని గ్రహించవలయును. మరియు దేహేంద్రియ మనోబుద్ధుల యొక్క నిశ్చలరూపమగు అకర్మను స్వస్వరూప వ్యతిరిక్తమగు కర్మగా దెలిసికొనుటయే అకర్మయందు కర్మను దెలిసికొనుట.

ఇట్లాత్మయొక్క స్వస్వరూపమును- తద్భిన్నమగు దేహేంద్రియాది ప్రపంచముయొక్క మిథ్యాత్వమును దెలిసికొన్నవాడే విద్వాంసుడు.

N. B. : నిర్వ్యాపారత్వముకూడ నొకవిధమగు కర్మయే యగు చున్నందున దానిని అకర్మయని చెప్పరాదు. పారమార్థికమగు నిష్క్రియ స్థితియే అకర్మ. కనుక కర్మయగు జగత్తునుకూడ అకర్మయొక్క ఆవిష్కరణమనియో భ్రాంతిజ్ఞాన సంజనిత పూర్వకమనియో అందుచే అధిష్ఠాన తత్త్వమునకు అనన్య అభిన్నతత్త్వమని విశ్వసించుటయే కర్మయందు కర్మను అనుభూతి పొందుట. ఇట్టిది సర్వేంద్రియ గుణాభాసం....

శ్లో॥ న చ మత్స్థాని భూతాని పశ్యమే యోగమైశ్వరమ్ ।
భూత భృన్నచ భూతస్థోమమాత్మా భూతభావనః ॥ (9-5)

పదములు : భూతభృత్ చ = భూతముల ధరించినదయ్యును

భూతభావనః = భూతముల ఉత్పత్తిస్థితులకు కారణభూతమగు నా ఆత్మస్వరూపము

భూతభృత్ = భూతముల ధరించియు

భూతస్థః = భూతములయందున్నది న = కాదు.

తాత్పర్యం : భూతముల ఉత్పత్తిస్థితులకు కారణమగు నా ఆత్మ (స్వరూపము) భూతములకు ఆధారము, ఆధేయమునైనట్టిది గాదు; అంటే ఆత్మ భూతములను తాను ధరించియుండలేదు. భూతములచే ధరింపబడి వాటియందుండనూలేదు. ఇక్కడ ఒక చిక్కు ఎదురౌచున్నది. ఏమన — భూతములు వేరు, పరమాత్మ వేరు అను భావస్ఫూర్తి కలుగుచున్నది. రెండు భావపదార్థముల నంగీకరించితే ద్వైతమే సంభవమగుగదా! దీనికి పరిష్కారమెట్లు — రజ్జువు, సర్పమును రెండుగావు అనుటకు రజ్జు సర్ప

భ్రాంతిని ఉదాహరణగ జెప్పియుండెను శంకరుడు. దీనిని హృదయంగమముగ గ్రహించినవారికి శాస్త్రహృదయము విశదమై ఒక పరిష్కారమార్గము ప్రాప్తించును. ఈ వివరణను పరిశీలించండి.

వంకర టింకరుగయున్న తాడొకటి నేలపై పడియున్నది. అది సంజ చీకటి సమయము. లేక ఒకవేళ వెలుతురు ఉన్నను, చూచేవాని కంటియందొక దోషముండియుండిన— దానినిచూచి ఇక్కడ ఏదో యున్నట్లున్నదే! ఇది— ('ఇది' ఏదో ఇంకా గ్రహింపబడలేదు) అనే భావము అజ్ఞానమునందలి తమోగుణ ప్రాబల్యముచే కలిగినట్టిది. తమోగుణము అజ్ఞాన కారకము కనుక, మన చూపువల్ల కలిగిన జ్ఞానము 'ఇది' దగ్గిర ఆగిపోయినది. ఆ అజ్ఞానమునందు సత్వగుణాంశకూడ యుండినందున— ఇది పామువలెనున్నదేయను స్ఫూర్తి కలుగుచున్నది. తాడు ఇక్కడ పాముగ తెలియబడుచున్నదిగానీ ఆపాము తాడునందు లేదు. పాముగా కనిపించేతాడు పాము గాదు ఇప్పుడు మనకు రాశిపూర్వకమగు స్వరూపమేలేని పామొకటి ప్రభవించి దృగ్గోచరమగుచున్నదిగాని— ఇది తాడునందు ఆధేయముగాదు. దీనికి తాడు ఆధారముగాదు. అసలు అక్కడ తాడు అనబడేది ఒకటి ఉండకపోతే- ఆధారము ఆధేయము అనే పదములకు ప్రసక్తి యుండేది కాదుగనుక అది అధిష్ఠానము— ఈపాము ఆ అధిష్ఠానముపై అధ్యారోపితమైనదేగాని నిజమునకు ఉనికితో ఉండలేదు. దీనినే "ఇల్యూషన్" అని అంటారు. ఈ పాము ఉనికివంటి ఉనికిగలదే ఈ ప్రపంచము అంటారు పెద్దలు. ఈ భావమును విశ్వసించగలవారికి "ఉన్నది ఒకటే" రెండవది తాత్త్వికముగ లేదు అను మాయావాదసిద్ధాంతము అవగాహన కాగలదు. ఇట్టి అవగాహన అందరకు కలుగజాలదు. ఇది రాజగుహ్యము. ఇదే రాజ

విద్య. ఇదే వివర్తవాదబోధకము. "విపృత్తం బ్రహ్మ జగద్రూపేణ ఇతి వివర్తమ్" అను ప్రవచన భావమునకు ఇదియే సూత్రము.

అయితే ఈ అధ్యారోపిత, భ్రాంతిజన్య పాముకు రూపమున్నది గాని రాశిలేదు, కానీ జగత్తుకు రాశియున్నదని పంచభూత విజ్ఞానము పంచీకరణ విధానములు తెలుపుచున్నవి. అయితే వేదాంతులు ఇది స్వప్నము నందు గోచరించు రాశివంటిదేగాని అన్యముగాదు, అజ్ఞానము తొలగినవెంటనే ఇదియును లేకయేపోవునని యందురు. అన్యులు (వేదాంతులు కానివారు) రాశికి పరిణామ నిత్యత్వమును చెలిపి జగత్తు పరిణమించుచు మిథ్యవలె తెలియబడునుగాని ఇది పదార్థముగ పరిగణించిన నాశము లేనిదని కనుక పరిణామసత్యమేననియు చెలుపుదురు. ఇవి రెండు దృక్పథములు.

ఈ విచారణయందలి గ్రాహ్యాంశమేమన జగత్తు భ్రాంతిజ్ఞానజన్యము గాదనియు అజ్ఞానముచే ప్రాప్తించునది దేహాత్మభావము, అందుచే ప్రాప్తించునవి జీవధర్మములనియే. ఇక రెండు శ్రుతివాక్యములతో ఈచర్చ నుపసంహరింతును.

I. శ్రుతి :

యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుశ్శ్రోత్రం।
యదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం
తదవ్యయం యద్భూత యోనిం పరిపశ్యంతి ధీరాః॥ (ముండక)

ఆత్మ అద్రేశ్యం = బుద్ధీంద్రియములచేత చూడబడదు.

,, అగ్రాహ్యం = కర్మేంద్రియ స్పర్శమున కందదు.

,, అగోత్రం = శ్రీవత్స వశిష్ఠ భరద్వాజాది ఋషి సాంప్రదాయము లకు చెందినది గాదు.

ఆత్మ అపర్ణం = స్థూలం, కృశత్వం తెలుపు ఎరుపు మున్నగు ద్రవ్య ధర్మములుండవు.

,, అచక్షుశ్రోత్రం = నేత్రశ్రోత్రాది జ్ఞానేంద్రియములచే విషయ గ్రహణ ప్రక్రియ ప్రాప్తించదు.

,, అపాణిపాదం = కర్మేంద్రియము లుండవు.

,, నిత్యము = ప్రలయకాలమందును స్థిరమైయుండును.

,, విభువు = సర్వవ్యాపి.

,, సర్వగతము = ఆకాశమువలె సర్వవ్యాపి.

,, సూక్ష్మము = అణువుకంటెను సూక్ష్మాతిసూక్ష్మము = శబ్ద స్పర్శ రూప రస గంధము లనబడు పదార్థాంశలు లేనిది, అనగా తన్మాత్రలవంటి **prematerial** భూతపూర్వరూపస్థితి.

,, అవ్యయము = తరిగిపోనిది; "అస్తి జాయతే వర్ధతే పరిణమతే వినశ్యతి" అను షడ్భావ వికారములు లేనట్టిది.

,, భూతయోని = పృథివ్యాది స్థావరజంగమ పదార్థములకు మూల కారణమైనట్టిది.

పై శ్రుతివాక్యముల భావములు ఆత్మతత్త్వ నిరూపణములు :

వ్యుత్పత్తినిబట్టియు గ్రహింపగల విషయములు :

1. అతతి = బాహ్యాంతరములయందు వ్యాపించియుండునది ఆత్మ.
2. అతతి సరతీతి ఆత్మ = సంసారమునందే ఎప్పుడూ చరించునది జీవ భావ సూచకమగు ఆత్మ.

3. అత్తి ఇతి ఆత్మ = సర్వ కర్మఫలములను భుజించువాడు.(జీవుడు)

4. ఆదత్తే ఇతి ఆత్మ = సర్వ నామ రూపములను తానే గ్రహించెడి తత్త్వము. ఇది మౌలిక ఆత్మభావము.

శ్రు॥ పూర్ణమదః పూర్ణమిదం । పూర్ణాత్ పూర్ణముదచ్యతే ॥
పూర్ణస్య పూర్ణమాదాయ । పూర్ణమేవావ శిష్యతే ॥
(శుక్లయజుస్ శాంతిపాఠం)

ఆదం = 'అది' అది యన నేది? కారణాత్మకమగు పరబ్రహ్మ - పూర్ణం - ఇది బ్రహ్మాండము.

ఇదం = ఇది 'ఇది' యన కార్యాత్మకమగు జగత్. అవిద్యతోకూడిన జీవుడున్ను (పిండాండము) ఇదియు పూర్ణమే.

పూర్ణమగు పరబ్రహ్మమునుండి, అనగా కారణబ్రహ్మమునుండి కార్యబ్రహ్మమగు జీవజగత్తులు కలుగుచున్నందున ఇది అనబడునదియు పూర్ణమే.

ఉదచ్యతే = ఇది పరమాత్మభావమును త్యజించదు.

పూర్ణస్య = కార్యాత్మ్మకైన జీవబ్రహ్మయొక్క

పూర్ణమాదాయ = కారణసత్తను అవగతం జేసికొనినందున — అవిద్యోపాధివలన గలిగిన మాయ, ఆవరణము తొలగిపోగా, జ్ఞానపూర్ణత్వము నొంది ఆత్మజ్ఞానమువలన తానుకూడ అవిచ్ఛిన్నమైన పూర్ణమునే గ్రహించి తాదాత్మ్యము నొందగా

పూర్ణమేవావ శిష్యతే = ప్రజ్ఞాన ఘనైక రస స్వరూపమగు పరబ్రహ్మయే ప్రాప్తించుచున్నది.

తత్త్వసారము : కారణరూపమగు పరబ్రహ్మ వివర్తమే కార్యరూపమగు జీవేశ్వర జగత్తులు. ఇట్లు వివర్తమగుచున్నందున కార్యకారణములకు అభేదము అనన్యతయు సిద్ధించుచున్నది. అందుచే కార్యకారణములు రెండును బీజాంకుర న్యాయానుగుణముగ ఒకే పూర్ణమగు తత్త్వమని తెలిసికొనవలెను. కారణసత్తను అవగతము చేసికొన్నయడల అవిద్యచే ప్రాప్తమైన ఆవరణ విక్షేపములు అవగతమై జ్ఞానము పూర్ణత్వము నొందగా తానుకూడ తదాత్మ్యభావముచే ప్రజ్ఞాన ఘనైక రస స్వరూపమగు పరబ్రహ్మమే పరిపూర్ణమే యగును. అదియే ఆత్మతత్త్వము. ఈ తత్త్వవివేకమే ముక్తికారకము.

పరమహంసాయ ధీమహి.

